# ఆనందసుధానిధి

( సుజ్ఞాన ప్రబోధిని )

గ్రంథకర్త:

అట్లూరి కూర్మారాయుడుగారు



ప్రకటనకర్త:

అట్లూరి బాలకృష్ణయ్యచౌదరి



బెజవాడ:

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల,

1938.



[వెల 1—0—0.

# పీఠిక

శ్రీమదఖండ మహీమండలాంతరమునం దనంతాఖ్యా చిదానందవిజ్ఞాన నిత్యనిర్మల నిరుపమాన స్వయంజ్యోతి స్వరూపధారియగు పరబ్రహ్మస్థాననిర్ణయ నిరూపకానంతప్రాప్తి హేతుర్భూత కార్యకారణ రహితత్వ కారణంబగు, జగజ్జీవేశ్వర సహిత నిర్మలప్రకాశ పరమాత్మవ్యక్తి ప్రభూతవిజ్ఞానులగు ముముక్షుజన హృదయానందకరంబుగా ఈ గ్రంథరాజంబు సద్గురు కృపావలోకన దృష్టిచే మహాపురుష నిర్మిహితంబై యొప్పారుచున్నయది.

ఇందు సూత్రలోపంబు లక్కడక్కడ గలిగియున్నను ప్రత్యక్షానుభవ సూత్రార్థమును గ్రహించువారలు లోపంబుగా నెంచరని యీ గ్రంథమే చెప్పకచెప్పుచున్నయది. ఇందలి విశేష మేమన త్రివిధబద్ధత్వములను విడజేయు అనుభవనియత మగు శబ్దవిజృంభణ సమూహముల పదేపదే గుప్తార్థరహిత ముగ సగుణనిర్గుణ పదపద్యముల కేవలాత్మ సంబోధన సాంప్రదాయ సరసమధుర వాగ్విలాస వైఖరుల నిండబడి యుండు ఈ గ్రంథమునం దనంతార్థముల ప్రజ్ఞనాసంగు పద గుంభనలచే గూర్చిన యీ మహాపురుషుని ప్రజ్ఞావిశేషము పండితజనసామాన్యముగా దలంప నశక్యంబై యిందు గాన్పించుచున్నది. వారువిశేష విద్వత్తుగలవారు గాకపోయి నను,ఆత్మపూర్ణావలోకనదృష్ట్యానుభవ పూర్వకముగాతనంతట తాను తటస్థలక్షణ సంబోధనలనే వ్రాయబడి యందు శ్రీకృష్ణభగవానుల బాల్యక్రీడార్థముల విశేషార్థముగాను ఆత్మ

పరమాత్మల సంబోధనకరముగాను గురుతత్వ పరిదర్శనకరము లగు సాంఖ్యతారకామనస్క భావపూరితములగు తత్వాంత ములయందు పూర్ణదృష్టాంతములను, సూచనరూపముగా నిర్ణ యించి సగుణనిర్గుణాతీతంబగు మహాపదవి యనుభవ వేద్య మగునటుల యీ గ్రంథమునందంతట నియమరూపమగు గీతాదులలో పూరింపబడునటుల, స్వానుభవ విశేషమును, వెల్లడించిన యీవేత్తకు కృతజ్ఞతా పూర్వకవందన శతసహ స్రింబుల నర్పించినను, నిష్ఫలము గానేరదు. ఇదియె నా నిజోద్దేశ్యము.

ఈ కవితయందు గీర్వాణ తద్భవ తత్సమ ప్రాకృత దేశీయ భాషలలో సంధి స్థానముల నతకబడినను అక్కడక్క డను వ్యాకరణ లోపములు గలిగియున్నను, వాటిని సవరించు టకు. గురువాక్యభంగ దోషభీతిని గదల్ప నేరనైతినో, తత్త స్థానములయం దిమిడియున్న అనుభవామృత మహాప్రవాహం బున, మగ్నతయగు హృత్పద్మాచలనముననో, వాటిని గదల్చ కూరకుంటిని. సామాన్యజనములకు దోచబడు అర్థవిశేషము లిందలి విశేషార్థములలో మునిగియే తోపనంతటి పదసంధు లను గదల్ప సామాన్యప్రయత్నము గానేరదు. శక్తిహీన ప్రయత్న మప్రయత్నముగా మారుటయే యిందలి విశేషము. గుణసామాన్యులు గుణాధికములలో నెట్లు చరింపనేరరో, యట్లే, తత్తస్థానానుభవముల గ్రహించుట సామాన్యప్రజ్ఞ గాదు, అసమానులు గదల్ప నేరరు, గాన నేను వారలలో నొకనిగ నిర్ణయింప ప్రార్థితుండను.

సర్వ ముముక్షూపయోగార్థముగా, ఆ మహానుభావునిచే
వ్రాయబడిన "ఆనందసుధానిధి" యను సద్గ్రంథరాజమును
తత్ ప్రబోధార్థగురుసాన్నిధ్యమున తత్తద్విశేషముల గ్రహించు
మోక్షార్థులకు ముముక్షుత్వ భంగము రానేరక, సర్వభ్రాంతులు
నశించి మోక్షసామ్రాజ్యపదవిని బొందగలరు.

మోక్షార్థులకు చతుర్విధోపాయములుగా పూర్వాచార్య
నిర్ణయము. అందు సామాన్యులకు మంత్రయోగముగాను,
కించిద్విశేషజ్ఞులకు లయయోగముగాను, అధికప్రాజ్ఞులకు
హఠయోగముగాను, పూర్ణప్రజ్ఞులకు రాజయోగముగాను,
నిర్ణయములు. ఇది యొకసామాన్యప్రజ్ఞ. అం దనంతవిధము
లుగా ప్రజ్వరిల్లుచున్నదిగాని, జ్ఞానము తద్యోగగుప్తమగుటచే
ఆయోగాదులచే దెలియుట అసాధ్యమగును, ఆయోగములు
సవికల్పము, నిర్వికల్పములుగా పూర్వసమ్మతముల చెప్పబడు
చున్నవి. అందుచే అవియును మోక్షార్థములుగా భ్రమింప
జేయకమానవు. మోక్షము అనగా, విడచుటయని భావము.
ఏమివిడచుటయని శంక గలిగినచో తోచబడునది సర్వమువిడ
చుటయేయని యర్థము. పైచెప్పబడిన యోగాదులలో తాను
వుండి చేయుకార్యములేయగును, విడచుటలో తానుకూడాలేని
కార్యము, పైయర్థమునుగల న్యాయమును విచారించిన మంత్ర
యోగము భక్తిగాను, లయయోగము జ్ఞానముగాను, హఠ
యోగము వైరాగ్యముగాను, రాజయోగము, తత్వము

గాను పరిఢవిల్లుచున్నది. ఇందుగలమార్గములను గ్రహించుట సాధనచతుష్టయమునగాని గలుగనేరవు, చతుస్సాధనరహిత మగు జ్ఞానము పునరావృత్తి హేతువగుచుండ జ్ఞానగుప్తమగు యోగాదులయందు గలుగు మోక్షమెట్టిదో మీామీామహాద ముల మీారేనిర్ణయించుకోగలరు. అందు జెప్పవలసిన దేమియు లేదు. ఉత్కృష్టమైన యీామార్గంబులే దోషబాహుళ్య ముగాఁదోచ ప్రాపంచభ్రామిక రూపమగు సగుణమని విగ్రహా రాధనయు, నిర్గుణమని మంత్రజపములయందుగల విశేషముల మీారే నిర్ణయించగలరు. ఇందు భక్తి జ్ఞాన వైరాగ్యములు ముముక్షు సగుణోపాసనగాను, సద్గురువులచే గ్రహింపబడు వేత్తలకే పరమపదప్రాప్తి సంప్రాప్తమగునేగాని తదితరు లకు దుర్లభము.

ఈ గ్రంథమునందలి సర్వవిషయములును సగుణ నిర్గుణోపాసకరమగు విశేషపదమునే, సూచించుచున్నవి. మహానుభావులారా! యిట్టి గ్రంథములను అనేక మహా పురు షులు వారివారి స్వానుభవసిద్ధిని మొట్టమొదటనే తెలియు నటుల జగద్విఖ్యాతిగా వెల్లడిజేసియేయుండిరి. వారందరిలో వీరొక మహానుభావులరగు చౌటపల్లిస్వస్థానముగాగలిగి కొన్ని గ్రామముల సత్పురుషుల హృదయములు పావనములగునటుల యేతత్తత్త్వమును ఉపదేశరూపముగా సంబోధించి ప్రఖ్యాతి వడసిన శ్రీమాన్ అట్లూరి కూర్మారాయ గురుశ్రేష్టుడు

యేతత్సంవత్సరముకు అష్టహాయనములకు లోగడ శుక్ల నామ సం॥ కార్తీక శు ౧౫ స్థిరవారమునకే యీ గ్రంథమును సంపూర్తి జేసివారు పరమపదించిరి. నేటికి వారిసుతులగు శ్రీ బాలకృష్ణయ్యాచౌదరిగారి కృషివలన యీ గ్రంథము ప్రపంచ వ్యాపకసిద్ధిని బడసినది, గాన యార్యజనులారా! యిందువలన అసారములవిడచి సారపదప్రాప్తినిఁ బొందగోరం దజ్ఞుల ప్రార్థనరూపకముగా వందనము లాచరించెద."

ఇట్లు,

5–12–1937
ముకాం గుడివాడ.

సాధుజనవిధేయుడు,
కంతేటి వీరయ్య.

ఓమ్

శ్రీ సద్గురవే నమః

# మ న వి



ఆత్మస్వరూపులగు నో సోదరులారా!

ఈ గ్రంథరాజంబు నా జనకులగు కీర్తిశేషులైన శ్రీమాన్ అట్లూరి కూర్మారాయుడుగారిచే ఆ 1927 సం॥రమున వ్రాయబడినది. తదుపరి వారు ఈ "ఆనంద సుధానిధి"ని ముద్రించి ప్రకటింప సంకల్పించిరిగాని, ఆపని కొనసాగక పూర్వమే, వారు దేవదూతాహూయమానులై స్వర్గమలంకరించిరి. అప్పటికి వేదాంతమునం దభిరుచిలేని నాకు ఈగ్రంథమును చూచుటకుగాని, ప్రకటించుటకుగాని సావకాశము కలుగలేదు. కొంతకాలము గడచినవెనుక నా తండ్రిగారి శిష్యులగు మలిరెడ్డి రామయ్య, అన్నే రత్తమ్మగారలు ప్రోత్సహించి నన్ను వేదాంతాభిలాషుని జేసిరి. 1934 సం॥రములో ఆధ్యాత్మికతత్వవేత్తలును, రాజకీయ ధురంధరులును, విజ్ఞానాశ్రమాచార్యులును నగు కీ॥ శే॥ శ్రీమాన్ రామినేని కోటయార్యుల వారివల్ల నేను మంత్రోపదేశమును పొంది, తదాది తత్వవిచారణమునందు నిమగ్నుడనై మా నాయనగారి యీ వేదాంత గ్రంథమును గూడ చదివితిని. అనేక ఆశ్రమముల దర్శించి, ఎందరో పెద్దలవలన కొన్ని సంశయములు నివారించుకొని, చివరకు శ్రీయుతులు మొనిగళ్ళ వేంకటప్పయ్య, గూడపాటి వేంకటసుబ్బయ్యగారలవల్ల పరిపూర్ణబోధను పొందితిని.

ఇట్లుండగా ఒకనాడు చెన్నపురి వాస్తవ్యులును, శ్రీమదచల స్వరూపులును, ఆశుకవిశిఖామణులును నగు శ్రీమాన్ పోకల నరసింహారావు నాయుడుగారును, శ్రీశ్రీ బ్రహ్మానందగిరిస్వాములవారునూ మా యింటికివచ్చిరి. అప్పుడు వారికి నే నీ గ్రంథమునుజూపగా, వారు పరిశీలించి, దీనిలో చాల రహస్యార్థము లిమిడియున్నవనియు, అభ్యాసకులే కాక ఆరూఢులుకూడ చూచి నేర్వదగిన విషయములున్నవనియు, తప్పక దీని నచ్చు వేయించి పితృఋణము దీర్చుకొనుమనియు నన్ను హెచ్చరించిరి. నాడు మొద లీ గ్రంథమునం దమిత భక్తి శ్రద్ధాయుక్తుడనై, దీనిని ప్రకటించి, భక్తకోటి కెటు లందీయ గలనా? యని యాలోచించితిని. మాతండ్రిగారి స్నేహితులును, నూజవీట్పుర వాసులును, శ్రీమ దచలస్వరూపులునగు శ్రీయుత కంతేటి వీరయ్యగారికడకుపోయి, వారి కీ గ్రంథమునుజూపగా, వారు దీని నమిత భక్తిశ్రద్ధలతో పరిశీలించి, అందందుగల లోపములను సవరించి, ముముక్షు జనానందకరముగా దీనికి పీఠికనువ్రాసి నాకొసంగి, గ్రంథకర్తగారియెడల వారికిగల యభిమానానురాగముల వెల్లడించిరి. అందులకు వారికి నే నెంతయు కృతజ్ఞుడను.

షట్ప్రకరణభాసితంబై వేదాంతతత్వ బోధనా పటిష్ఠంబై, ఆధ్యాత్మికానందసంధానచతురమైన ఈ యుత్తమ గ్రంథమును ధనాశచే సాధారణ మానవునకు కృతినీయ నిచ్చగింపక, దీని నత్యంతభక్తితో శ్రీ గాంధిమహాత్మునికి కంకితము చేసితిని. నా శక్తికి మించినను దీనిని స్వయముగ నేనే ఆంధ్ర

గ్రంథాలయ ముద్రాశాల, బెజవాడలో ముద్రింపించి, భక్త లోకమునకు సమర్పింపగలిగితిని. ఇందలి బోధనాపరములైన విశేషాంశములను తత్వజ్ఞులు విచారించి, అనుభవానందములంది, మోక్షపదప్రాప్తు లగుదురని విశ్వసించుచున్నాను.

చాటపల్లి,
1—2—1938.

ఆట్లూరి బాలకృష్ణయ్య చౌదరి,
ప్రకటనకర్త.



గ్రంథరచయిత:

శ్రీ అట్లూరి కూర్మారాయుడు గారు

# శ్రీమాన్ అట్లూరి కూర్మారాయగురు
# నిర్యాణ స్తవరాజీయము.

---

శా॥ ధర్మంబుల్ పొనరించువారును సముద్యద్దాన సత్రాదులన్
నిర్మాణంబొనరించువారును యథానిర్దిష్ట శాస్త్రార్థముల్
పేర్మింజెప్పెడు తత్త్వవేత్తలును బల్ పేరొంది తామిట్టు లీ
కూర్మారాయునిఁబోలెనెల్లయెడలంగొన్నారె సన్మానముల్.

సీ॥ నాదుసర్వస్వ మంతర్ధానమును జెందె
నేమిచేయుదునంచు నింతి యడల
నింట దైవముఁబోలె నెపుడు దర్శనమిచ్చు
పిత యింకలేడంచు బిడ్డ లేడ్వ
నజ్ఞానతిమిరంబు నడచు మా దీపంబు
చాటయ్యెనని శిష్యకోటి వగవ
వేదాంతమునుగూర్చి వేడ్కతో వాదించు
పురుషుడేడని మమ్ముబోంట్లు కుంద

గీ॥ ఇంతకాలంబునకుఁగదా యిట్టిమూర్తి
కౌగిటకువచ్చెనని ముక్తికాంత నవ్వ
కేవలపదంబుచేరితే కీర్తికాయ
ధర్మగుణగేయ యట్లూరి కూర్మరాయ.



సీ॥ సోమేశ్వరునిపైని ప్రేమనంది నొసంగి
కృత్తికాదీపంబు లెత్తినావు
కేశవస్వామిపై కీర్తనల్ రచియించి
చలువచప్పరము నొసంగినావు
శివకేశవులయందు లవమైన భేదంబు
లేని సమ్మతము పాలించినావు
స్థిరముగా బలుచోట్ల శిష్యబృందము గూర్చి
జ్ఞానోపదేశంబు సలిపినావు
గీ॥ శక్తికొలదిని సత్క్రియాచరణమూని
కీర్తిలతలను దిశల బ్రాకించినావు
నిశ్చలసమాధిగతుడవై నెగడినావు
ధర్మగుణగేయ యట్లూరికూర్మరాయ.

సీ॥ కోరినట్లెల్ల నే కొరతరానీయక
జీవితాంతముదాక సేవజేసె
నడిగినట్లెల్ల నీయభిమతంబులుదీర్చి
యిహలోకమందు సుఖింపజేసె
జెప్పినట్లుత్తమసిద్ధికై తగినట్టి
పారలౌకికవిధుల్ భక్తిజేసె
నియమించినట్లెల్ల నీమాటజవదాట
కాజ్ఞానిబద్ధుడై యనువుజేసె
గీ॥ "నొక్కడేచాలు నవగుణుల్ పెక్కురేల"
యనెడు లోకోక్తిసార్థకమైచెలంగ

నీదుపుత్రుండు సర్వంబు నిర్వహించె
బాలకృష్ణాభిధానుండు భవ్యగుణుఁడు.

వ॥ నిరుపమభక్తియుక్తులగు నీప్రియశిష్యులు శిష్యరాంద్రున
చ్చెరువుగవచ్చి నీకు తగు సేవలుజేసిరి కన్నబిడ్డ లీ
వరుసను జేయలేరనుట వాస్తవమేగద కూర్మిరాయ ని
బ్బరముగసిల్చె నీదు గురుభావము వారలశిష్యభావముల్.

వ॥ సరసుడు మల్లిరెడ్డి కులసంజనితుండగు రామయాఖ్యుఁ డ
బ్బురముగ జబ్బుగొన్న తనముద్దుకుమారితనైనపీడి మీ
పరిసరమందునిల్పి యెడబాయడ యియ్యది నీమహత్వమో
యరయఁగ రెడ్డిగారి సుగుణాతిశయంబొ యెరుంగనేర్తుమే.

॥ జీవితమునందు సౌఖ్యసంసిద్ధి కెట్టి
కొరతలేకుంటచే శాంతిగొంటివిపుడు
ఆత్మసాయుజ్యమును జెందినట్టినీవు
పూర్ణశాంతిని బొందు టబ్బురముగాదు.

4-11-1929, ఇట్లు,
చాటపల్లి. విద్వాన్, సూరపనేని సీతారామయ్యచౌదరి.

## అంకితము



అసమాన మాతృదే◆శారాధకాచార్యు
డనుపమ సత్యదీ◆క్షైకరతుడు
అతులిత రాజకీ◆య కళాపరిపూర్ణుండు
సంస్కార ధర్మని◆ష్ఠాపరుండు
తతక్రియాద్వైత గీ◆తాభాష్య నిర్మాత
కార్యశూరుండైన ◆ కర్మయోగి
దివిజ సంస్తుత్య నై◆తికపూతచారిత్రు
డధ్యాత్మతత్త్వ ర◆హస్య వేది

గీ॥ ఘనదయాగుణసాంద్రుండు ◆ కర్మచంద్ర
ధీర మోహనదాస గాం◆ధీమహాత్ము
సారతరపూజ్య పాదపం◆కేరుహముల
కంకిత మొనర్చుచుంటి న◆త్యంతభక్తి.

ఇట్లు,

ఆట్లూరి బాలకృష్ణయ్యచౌదరి.

# విషయానుక్రమణిక

ఓమ్

శ్రీ సద్గురుపరబ్రహ్మణే నమః

# ఆనందసుధానిధి

## ప్రార్థన

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః,
గురురేకం పరంబ్రహ్మ, తస్మై శ్రీగురవే నమః.

శ్లో॥ అజ్ఞానమూలహరణం, జన్మకర్మనివారణం,
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం, గురుపాదోదకం పిబేత్.

శ్లో॥ సంసారసాగర సముద్ధరణైకమంత్రం,
బ్రహ్మాదిదేవముని పూజిత సిద్ధమంత్రం,
దారిద్ర్యదుఃఖభవరోగ వినాశమంత్రం
వందేసదాభయహరం గురురాజమంత్రం.

శ్లో॥ గురుపాదోదకంపీత్వా గురోరుచ్ఛిష్టభోజనం,
గురుమూర్తిం సదాధ్యానం గురుమంత్రం సదా జపేత్.

శ్లో॥ కాశీక్షేత్రనివాసంచ జాహ్నవీచరణోదకం,
గురుర్విశ్వేశ్వర స్సాక్షా త్తారకం బ్రహ్మ నిశ్చితం.

కం॥ విద్యాస్వరూపుడవును సు
బోధ్యంబౌ నీదుప్రభను ♦ బొగడుటకు మహా
వేద్యులకైనను దరమే
శ్రద్ధగగురుమహిమ మదికి ♦ స్తవనీయముగున్.

కం॥ మ్రొక్కెద దేశికవరునకు
మ్రొక్కెద ధర్మార్థకామ♦ మోక్షదునకు నే
మ్రొక్కెద పదములకనిశము
మ్రొక్కెద శ్రీసుబ్బరాయ♦ మోదాఖ్యునకున్.

శ్లో॥ శ్రీవాసిష్ఠాన్వయే జాతం సుబ్బరాయపదాశ్రియం,
దాసోఽహం కూర్మరాయాఖ్యం శ్రీగురోః ప్రణమామ్యహం.

కం॥ శ్రీసీతావల్లభ! నా
గాసినితొలగించి నీదు ♦ ఘనదాసునిగా
జేసి దయనేలుభువిలో
వాసవవందిత మహాత్మ ♦ వందనము హరీ.

కం॥ ఇంతింతని యనరాకయె
యంతట సంపూర్ణమైన ♦ యచలుడవని ర
వ్వంతైన ప్రకృతినంటక
కాంతురు నినుభక్తజనులు ♦ కళ్యాణనిధీ.

వ॥ ఈప్రకారముగా స్వగురుధ్యానంబును, ఇష్టదేవతా ప్రార్థనంబును జేసి, వ్యాసాది మహాఋషులకును ప్రహ్లాదాది

పరమభక్తులకును, కాళిదాసాదిమహాకవులకును అనేకవందనం బులుగావించి, హృత్పద్మమందిడుకొని సదాధ్యానారాధనిశ్చల చిత్తుండనై యున్నసమయంబున సచ్ఛిష్యుడైన మలిరెడ్డి రామయాఖ్యుం డడిగినప్రశ్నలకు అస్మద్గురుకటాక్షపూర్ణుండనై చెప్పదలంచిన సదుత్తరువులకుముందు అస్మద్వంశావళిని విని పింపదలచి యిట్లంటి.



# కృతికర్త వంశావళి

సీ॥ వసుధలో నట్లూరి ♦ వంశాబ్ధి చంద్రుడై
ధరను వెంగళనీడు ♦ దనరె దొలుత
అతిథి యభ్యాగత ♦ యాశ్రితులను బోచి
సత్కర్మ ధర్మల ♦ సంగ్రహించి
వెదురుపాడ్లూరను ♦ వెలయు గ్రామమునందు
నాదికేశవు ప్రతి♦ష్ఠమురజేసి
నిత్యనై వేద్య ఖం♦డోత్సవాదులకునై
సర్వదా జెల్లు వ♦సతు లొసంగి

గీ॥ సవినయంబుగ సద్భక్తి ♦ సలిపి హరికి
అచట వీడి వెన్నవపూడి ♦ యనగ నొక్క
గ్రామము ప్రతిష్టగాజేసి ♦ క్రమత నన్న
గారు పేర్నిడు దానును ♦ ఘనత నిలిచె.

ద్వి॥ ఇటువంటి వంశమం♦దింపుగా ధరను
పటుతరంబై యొప్పు ♦ పదియవతరము
నందు భూపతిరాయు ♦ డన్నపూర్ణామూర్తి
పొందుగా గుణముల ♦ పోవు రంగమ్మ
వీరి కిర్వురకును ♦ విఖ్యాతి మెరయ
వరుస పుత్రిత్రయి ♦ వలనొప్ప గలిగి
పట్టాభిరామయ్య ♦ పడిగయ్య యనగ
దిట్టరి వెంకయ్య ♦ దేదీప్యులైరి
వీరిలో జ్యేష్ఠుడై ♦ వెలసె పట్టయ్య
వీరికి సత్సతి ♦ వెలది యచ్చమ్మ
వీరికి సత్పుత్రి♦ తెలమి నల్గురిలో
సురుచిర మతియైన ♦ సుబ్బయాఖ్యుండు
తనతండ్రి పట్టయ్య ♦ ధన్యతకొరకు
ఒనరగ శ్రీరాము ♦ ఘనచరిత్రమును
పదపడి శ్రీ భాగ♦వతము లోపలను
పదకొండు స్కంధముల్ ♦ ప్రకటితముగను
కోరి తా వ్రాయించె ♦ కొందరిచేత
అరసి దశమస్కంధ♦ మనువొప్ప నపుడు.
సురుచిర మతియైన ♦ సుబ్బయాఖ్యునిచె
సారదిని ముత్యాల ♦ సోయగ మమర
తాను స్వంతముగాను ♦ తగలిఖియించె
మానితంబగు మహా♦మహిమ దీపింప

## కృతికర్త వంశావళి

ఆదిపంచకమన ♦ నల భారతమున
అయిదు పర్వంబులు ♦ అలరంగ వ్రాసి
పరగణా పెత్తనం ♦ ప్రఖ్యాతిగాను
వరుసతో జేసిరి ♦ వసుధ సత్కీర్తి
వీరి యనుజులెల్ల ♦ విఖ్యాతిగనిరి
ధారుణీ స్థలమందు ♦ ధర్మార్థబుద్ధి
తెలగయ్య యనుఘనుడు ♦ తెల్విగా గ్రామ
ముల పెత్తనముజేసె ♦ ముద ముప్పతిల్ల
వీరి సోదరుడైన ♦ వీరరాఘవులు
ధారుణీస్థలి కృషి ♦ దగనొప్పజేసె
వీరికి ననుజుడై ♦ వెలయు జ్ఞానయ్య
గురుభక్తి తాత్పర్య ♦ గుణముల నొప్ప
జ్ఞానయ్య వరసతి ♦ గౌరవాన్వితయు
మానిత గుణవతి ♦ మహాలక్ష్మిదేవి
వరుస తలితండ్రులై ♦ వర్ధిలజేయ
కూర్మరాయాఖ్యుడ ♦ కొమరొప్పనేను
గుణనిధులైన స♦ద్గురువుల కృపకు
పరిణతులొనర్చెద ♦ భక్తితో నెపుడు
వలనొప్ప సద్గురు♦వరు నెద నమ్మి
నాల్గు శుశ్రూషలు ♦ నయమొప్పజేయ
వరసుబ్బయార్యులు ♦ వరుసగా నాకు
తారక సాంఖ్యాది ♦ తత్త్వామనస్క

# గురుశిష్య ప్రశ్నోత్తరములు

ప్రశ్న॥ అయ్యా గురురాయా! చతుర్విధ శుశ్రూష లనియెదరు; అవియేవియొ, చేయువిధమెటులనో ఆనతివ్వవలె నని ప్రార్థించెద.

ఉత్తరము॥ శిష్యతిలకా! శుశ్రూషలనగా స్థానాంగాత్మ భావములని నాల్గువిధములు. అందు స్థానశుశ్రూష యనగా యాచార్యులుండు స్థానముకు వెళ్ళి యచ్చట గృహారామ క్షేత్రాదులను శ్రద్ధతో కాపాడుట; అంగశుశ్రూష యనగా గురువునకు అభ్యంజనాలంకారముల సంతసింప జేయుట; ఆత్మశుశ్రూషయనగా ఆచార్యుల యాత్మయం దేయిచ్ఛయున్నదో గ్రహించి యవియన్నియు సమకూర్చి నివేదించుట; భావశుశ్రూషయనగా ఆచార్యులే దైవమనిన్ని తల్లి తండ్రి దాతయు సమస్తస్వరూపము వీరేయనిన్ని నమ్మి ధ్యానించుట. ఇవి బాహ్యములు. ఇక అంతరశుశ్రూషల క్రమంబు జెప్పెద.

1 స్థానశుశ్రూషయన సద్గురూక్తములచే చూపించబడు గురుస్థానమేమరక స్థిరముగా నట తాను నిలచియుండుట.

2 అంగశుశ్రూషయన స్థూల సూక్ష్మ కారణ మహాకారణాంగముల యుత్పత్తిస్థితిసంహారతిరోధానముల గురుముఖమున సర్వముదెలిసికొని వైరాగ్యదశ స్థిరముగా నుండుట.

పరిపూర్ణ భావంబు ♦ బాగొప్పజెప్పి
చిరతర దయగల్గి ♦ శ్రీగురుస్వామి
ఆర్యాధికారంబు ♦ అమరంగనిచ్చి
ధీరునిగా జేసె ♦ దివిరి సద్గురుడు.

కం॥ పొందుగ శ్రీగురువరునకు
వందన మొనరించి భక్త♦వరులలరంగా
ముందుగ పరమార్థము నే
గ్రిందుకొనగ దెల్పువాడ ♦ కడురమ్యమునన్.

గీ॥ ఇందు చాల రహస్యార్థ♦మిమిడె సుమ్మి
సందులేకను గురుభక్తి ♦ సలుపగోరు
అందమా సాధుజనుల కా♦నందముగను
ముందుజెప్పెద మీర లిం♦పొంద వినుడు.

# గురుశిష్య ప్రశ్నోత్తరములు

ప్రశ్న॥ అయ్యా గురురాయా! చతుర్విధ శుశ్రూష లనియెదరు; అవియేవియొ, చేయువిధమెటులనో ఆనతివ్వవలె నని ప్రార్థించెద.

ఉత్తరము॥ శిష్యతిలకా! శుశ్రూషలనగా స్థానాంగాత్మ భావములని నాల్గువిధములు. అందు స్థానశుశ్రూష యనగా యాచార్యులుండు స్థానముకు వెళ్ళి యచ్చట గృహారామ క్షేత్రాదులను శ్రద్ధతో కాపాడుట; అంగశుశ్రూష యనగా గురువునకు అభ్యంజనాలంకారముల సంతసింప జేయుట; ఆత్మశుశ్రూషయనగా ఆచార్యుల యాత్మ్రయం దేయిచ్ఛయున్నదో గ్రహించి యవియన్నియు సమకూర్చి నివేదించుట; భావశుశ్రూషయనగా ఆచార్యులే దైవమనిన్ని తల్లి తండ్రి దాతయు సమస్తస్వరూపము వీరేయనిన్ని నమ్మి ధ్యానించుట. ఇవి బాహ్యములు. ఇక అంతరశుశ్రూషల క్రమంబు జెప్పెద.

1 స్థానశుశ్రూషయన సద్గురూక్తములచే చూపించబడుగురుస్థాన మేమరక స్థిరముగా నట తాను నిలచియుండుట.

2 అంగశుశ్రూషయన స్థూల సూక్ష్మ కారణ మహాకారణాంగముల యుత్పత్తిస్థితిసంహారతిరోధానముల గురుముఖమున సర్వముదెలిసికొని వైరాగ్యదశ స్థిరముగా నుండుట.

3 ఆత్మశుశ్రూషయన సద్గురు కరుణవలన పంచాత్మ లక్షణ లక్ష్యములను చక్కగా వాచ్యార్థ లక్ష్యార్థములు తెలుసుకొనుట.

4 భావశుశ్రూషయనగా సద్గురురాయు కటాక్షమూలముగా "బ్రహ్మసత్యం జగన్మిథ్య" యను శ్రుతి స్మృతి స్థిత్వముగా చలనాదులులేక సర్వము బ్రహ్మరూపమనే చూచుట

ప్ర॥ ఆధ్యాత్మికములన నెవ్వియో విసపింపుడు.

ఉ॥ శిష్యా! జ్ఞాత మొదలు పాయువువరకు ఇరువై అయిదింటి ఉత్పత్తిస్థితిలయస్థానములను చక్కగా దెలియుట

ప్ర॥ ఆర్యా! అధిభౌతికము లేవియో దయచేసి శె వింపు.

ఉ॥ కుమారా! తటస్థము మొదలు మలవిసర్జనవరకు తెలి యుట.

ప్ర॥ అధి దేవతలన నెవ్వియో వాటిమూలము దయ సేయుడు.

ఉ॥ కూటస్థుడు మొదలు మృత్యువువరకు జన్మకర్మలు చక్కగా దెలియుట. ఈ పై మూడే రజోగుణ తమోగుణ సత్వగుణోత్పత్తులు. ఈ మూడే భూలోక భువర్లోక సువర్లోకములు. ఈ మూడే విప్రులుజేయు వ్యాహృతులు. ఎట్లనగా భూః- భూలోకము, భువః- భువర్లోకము, సువః- సువర్లోకము. రజోగుణసృష్టి మానుషసంపద; తమోగుణసృష్టి అసురసంపద;

సత్వగుణసృష్టి దేవతాసంపద. ఈ మూడే గాయత్రి త్రిపాదములు. ఇదియే బాహ్యగాయత్రి; అంతరగాయత్రి దెలిసిన వారే సద్బ్రాహ్మణులని తెలియుము.

ప్ర॥ స్వామీ! వాసనత్రయములనగా నెవ్వియో యాలక్షణములు సెలవిండు.

ఉ॥ శాస్త్రవాసన, కులవాసన, లోకవాసన యందురు. వీనిలో శాస్త్రవాసన యనగా సమస్తశాస్త్రములుచదివి నిజమనినమ్మి వాటియందభిమానము విడువకుండుట. కులవాసన యనగా యష్టాదశ వర్ణములలో నేనుబాహ్మణుడను, బహ్మముఖమందు బుట్టినవాడను; నేను రాజును, బాహువులయందు బుట్టినవాడను; నేను వైశ్యుడను, ఊరువులయందు బుట్టినవాడను; నేనుశూద్రుడను, పాదములయందు బుట్టినవాడను; అని గర్వముతో గూడియుండుట. లోకవాసనయనగా లోకములో శాస్త్రములను చదివి యజ్ఞ యాగాదికములు చేయుచు సమస్త దేవతారాధనలుచేయుచు తిరునాళ్ళుతీర్థయాత్రలు మతములు ఇవియన్నియు మోక్షమని లోకనడతలు స్థిరములని నమ్మియుండుట.

ప్ర॥ గురూత్తమా! కర్మలు మూడందురు. వాటినివిశదీకరింపుడు.

ఉ॥ శిష్యోత్తమా! దుష్కర్మయని, సుకర్మయని, జ్ఞానకర్మయని మూడు విధములు. వీనిలో దుష్కర్మ యనగా అన్య

తము లాకుట, జారచోర మద్యపాన పరధనాసక్తత, జీవహింస జేయుట, హరిహర భేదము జేయుట, ఆర్యదూషణ దేవదూషణ కులాంగనా విసర్జన మొదలైనవి యాచరించి తుదకు మృత్యువు చేత కబళింపబడి యమలోకములో సమస్తమైన ఘోరనరకము లనుభవించి తుదకైనను మనుష్యజన్మప్రాప్తి లేక క్రిమికీటకాది జన్మల బొందింపజేయునది యని తెలియవలెను. ఇక సుకర్మ యెద్దియనగా గురుభక్తిగలిగి వేదాంతశాస్త్ర విచారణ జేసి శమాది షట్కసంపద గలిగి ఏకపత్నీవ్రతంబును అహింసా ధర్మంబును యజ్ఞయాగాది క్రతువులు మొదలైనవిచేస్తూ సర్వభూతతృప్తికై అన్నపానభక్ష్యము లొసంగుచూ ఈశ్వరార్పణబుద్ధ్యా జేయుచురాగా తుదకు దేవదూతాహ్వానయమా నులై స్వర్గలోకసౌఖ్యము లనుభవించి సలక్ష్యముకాగానే తిరిగి భూలోకములో మానుష జన్మంబెత్తి జ్ఞానియై యిహంపరము లపేక్షింపక ముక్తిమార్గంబు తెరవు జూపునది. జ్ఞానకర్మయ నగా ఆచార్య స్వాములవారి ముఖతా అండపిండ బహ్మాండ ములను విమర్శించి ప్రత్యగాత్మ పరమాత్మల లక్షణములదెలసి బ్రహ్మసత్యం జగన్మిథ్య యనే లక్ష్యముగని సదా నిశ్చలుడై యుండుట.

ప్ర॥ తండ్రీ! షడూర్ములేవియో వాటి సంగతిని బోధించుడి.

ఉ॥ బిడ్డా! శోకము, మోహము, ఆకలి, దప్పి, జననము, మరణము అని దెలియుము. శోకమోహములు

రెండున్నూ మనోధర్మములు. ఆకలిదప్పులు రెండున్నూ ప్రాణధర్మములు. జననమరణములు రెండున్నూ శరీరధర్మములుగా దెలియుము.

ప్ర॥ స్వామీ! దీక్షలు మూడని యందురు. వాటి సందర్భము లేవియో శెలవిండు.

ఉ॥ సద్గురుని కరుణయు, కటాక్షము, స్పర్శము అని దెలియుము.

ప్ర॥ ఈషణత్రియము లేవియో శెలవిండు.

ఉ॥ దారేషణ, పుత్రేషణ, ధనేషణలు. ఇందు దారేషణయన భార్యలయందు వ్యామోహము; పుత్రేషణయన కుమాళ్లు కుమార్తెలయందుగల బద్ధానురాగము; ధనేషణ యనగా ధనధాన్యాదులయందుండు అత్యాశ.

ప్ర॥ అయ్యా! తాపత్రియములని చెప్పుదురు. అవి యేవో శెలవిండు.

ఉ॥ కుర్రా! ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములు. వీటి వలన సంప్రాప్తమైన ద్వయసౌఖ్యములని చక్కగా దెలియుము.

ప్ర॥ గురురాయా! అవస్థలు మూడని చెప్పుదురు. ఆ స్థితులను చక్కగా బోధింపుము.

ఉ॥ జాగ్రత్ స్వప్న సుషుప్తులు.

జాగ్రత యనగా జీవుడుయిరువైనాల్గు యింద్రియములతో జతపడి తా నొక రాజువలె ఆజ్ఞాచక్రమును సింహాసనా

రూఢుడై లోకవ్యవహారములను పరిశీలించుసమయమున విశ్వు డనుపేరుచే పిలువబడుచుండును. స్వప్నమనగా పదియారింద్రి యములచే వ్యవహారము చేయుచున్నా కంఠస్థానమున తైజసుడను నామముచే నుండుకాలము. సుషుప్తియనగా పరిచారకులను విడచి యంతఃపురప్రవేశమైన రాజువలె, ప్రాజ్ఞుడనే నామముచేత హృదయస్థాన మందున్న యనాహత సింహాసనాసీనుండై నిశ్చలచిత్తముగానుండుట.

ప్ర॥ స్వామీ! నాడులు మూడనెదరు. వాటి సవిస్తారము ఆనతీండు.

ఉ॥ కుమారీ! ఇడా•పింగళ సుషుమ్నలు.

ఇడయనగా దక్షిణభాగము, సూర్యనాడి గంగయను పేరుచేత హాకారరూపమున తపినీ, తాపినీ, ధూమ్రా, మరీచి, జ్వాలినీ, రుచి, సుషుమ్నా, భోగదా, విశ్వా, బోధినీ, దారుణి, క్షమ యను పన్నెండునామములచే పన్నెండుఅంగుళముల వెలుపలికివచ్చి,నాలుగుతగ్గి, యెనిమిదింటిని లోపలికి తీసుకొను చుండును. పింగళయనగా ఎడమభాగము, ఉత్తరదిక్కు చంద్ర కళ, యమునావేగము, సకారాక్షర రూపమున అమృతా, మానదా, పోషా, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశిని, చంద్రికా కాంత, జ్యోత్స్నా, శ్రీప్రీతి, రంగదా, పూర్ణా, అపూర్ణా, అమృతదాయినీ యనుపదహారునామములచే పదహారు అంగుళముల వెలుపలిసంచారముచేసి ఆరింటవదలి పదింటిలోపలి తీసుకొనుచుండును. ఈరెంటిని కూర్చినదే సోహమనిపలు

కును. సుషుమ్నయనగా పశ్చిమదిక్కు, మధ్యభాగము అగ్ని కళ, ఐక్యస్థానము యీమూటి ఐక్యరూపమే "హంస" యన బడును. దీనికాంతులేవియన ధూమార్చి, రుష్మా, జ్వలినీ, జ్వాలినీ, విస్ఫులింగినీ, సుశ్రీ, స్వరూపా, కపిలా, హావ్యా, కవ్యా, యనుపదికాంతులచే సహస్రారమున ప్రకాశిస్తూ యుండును.

ప్ర॥ స్థానములు మూడందు రేవియో తెలపిండు.

ఉ॥ హృదయ, కంఠ, భ్రూమధ్యములు.

ప్ర॥ అండములు మూడందు రెవ్వి?

ఉ॥ అండము, పిండము, బ్రహ్మాండము.

ప్ర॥ త్రిమూర్తులనగా నెవరు?

ఉ॥ బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు.

ప్ర॥ గుణములుమూడు ఏవి?

ఉ॥ సత్వగుణము, రజోగుణము, తమోగుణము.

ప్ర॥ నాన్నగారూ! కోశములైదందురు, వాటినవిస్త రము తెలపిండు.

ఉ॥ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయ, ఆనందమయములు. అన్నమయమనగా అన్నముతో వృద్ధిబొందుచూ యిరువైఅయిదు యింద్రియములచే, యేకీ భవించి ఉన్నకాలము వృద్ధిక్షీణములుకలిగి అవయవాకార ముతో కనుపిస్తూ అహంకారముతోగూడి ఉన్న స్థూల

శరీరము. ప్రాణమయమనగా జ్ఞాతపంచప్రాణవాయువులతో గూడిన సమయమని తెలిసేది. మనోమయమనగా మనస్సు కర్మేంద్రియములతో గూడి స్వప్నవ్యవహారము చేయుసమయమని తెలుసుకొనవలెను. విజ్ఞానమయమనగా బుద్ధిజ్ఞానేంద్రియములతో కలసి జ్ఞానకర్మలుచేయునమయమని తెలుసుకునేది. ఆనందమయమనగా చిత్తము జ్ఞాతతో యేకీభవించి తన్మరచియుండుటే.

ప్ర॥ మలములు అయిదందు రేవియో తెలవుండు.

ఉ॥ అజ్ఞానమల, మాయామల, కార్మికమల, తిరోధానమల, మాయేయ మలములు. అజ్ఞానమలమనగా ఆత్మజ్ఞానము తనకు అప్పుడప్పుడు తోచినను దానిని మరుగుపరచునది యని గ్రహించవలెను. మాయామలమనగా బ్రహ్మజ్ఞానమును నేనాలమునందును తలచనివ్వనిది. కార్మికము అనగా జ్ఞాన శాస్త్రములయందలి తాత్పర్యములను గురుస్వాములవారు బోధించునపుడు దానియందు బుద్ధిచొరనివ్వనిది. మాయేయము అనగా సమార్యములయందు మనస్సును బొందుపరచునది. తిరోధానమనగా నిత్యమై నిర్మలమై ప్రకాశించు పరబ్రహ్మమందు అనిత్యబుద్ధిని గలిగించి యాపరబ్రహ్మానుభవముకన్న వేరుగా దేవతలు, మంత్రములు, మతములు యున్నవని అవియే నిత్యములని నిర్మలములని బుద్ధిపుట్టించి జననమరణ ప్రవాహములను జడదోయునది. గనుక, ఓయి కుమారా! సూర్యుని కాచ్ఛాదనగా ఆవరింపబడిన మేఘములు వాయువు,

చేత నశించినట్లు, ఆత్మకు అడ్డమైన మలపంచకమునున్నూ గురుబోధచే నశింపబడును గనుక ఆచార్యానుగ్రహము నొందుట ఉత్తమము.

ప్ర॥ అయ్యా! సూచనకాలమందు దీక్షాత్రయమును తెలియవలెనని శెలవిచ్చినారుగదా! అవి యేవి?

ఉ॥ శిష్యోత్తమా! స్వస్తికారోహణ, స్పర్శదీక్ష, వేద దీక్షయని. వీనిలో స్వస్తికారోహణమనగా శిష్యుని సిద్ధాసనమందు గూర్చుండనియమించుట. స్పర్శదీక్షయనగా శిష్యుని ముఖమందుండు పూర్వపువ్రాలుతుడిచి, తాను విభూతిచే వేరొకవ్రాలువ్రాసి, శిరస్సున జననభయరహితుడవు గమ్మని తనహస్తము వాని మస్తకమందుజేర్చి అభయవరంబిచ్చుట. వేదదీక్షయనగా మహావాక్యోపదేశమొసగి శృతి, స్మృతి, ఉపనిషదర్థములను బోధించి నీవున్నూ నీచేత వేరుగా భావించబడుచుండెడు సమస్తమున్నూ బ్రహ్మస్వరూపమేకాని తదితర పదార్థమేమియు లేదని దృఢముగా బోధించుటే.

అని తెల్పగా తెలుసుకొన్నవాడై సద్గురునకు అనేక ప్రదక్షిణసాష్టాంగనమస్కారములొనర్చి మరియు శిష్యుండిట్లనియె.

ప్ర॥ అయ్యా, గురురాయా! ప్రసాదతీర్థములు త్రివిధములనగా వినియుందు. వాటి బాహ్యాంతరములు లక్ష్యముల దయచేయుడు.

ఉ॥ శిష్యతిలకా! సావధానముగా నాకర్ణింపుము. అభ్యాసకాలమందు చిత్రాన్నఫల మధుతీర్థములని దెలియుము.

ఆ రూఢకాలమునకు గురుడు తనకుచ్ఛిష్టమైన దేహేంద్రియ ప్రపంచసృష్టియంతయు ననుభవింపజేసి భ్రాంతివదల్చుటవె ప్రసాదము. తీర్థమనగా సర్వం సమరసానుభవునిగాజేసి సర్వత్ర బుద్ధిస్థిరతయే గురుపాదోదకంపీత్వా అన్నందుకు సహస దళపద్మమున గురుమూర్తి నివాసముగనుక వారి పదముల యనగా హం క్షం యనునవి. తీర్థమనగా యీ రెండక్షరముల మీదుగా స్రవిస్తూయున్న ఆకాశధారను దెలసి గ్రహించి నిరంతర పానారూఢచిత్తుడై సదా యానందించుట.

ప్ర॥ గురురాయా కర్తలు ఐదుగు రెవ్వరో వారి మూలము చెప్పుడు.

ఉ॥ శిష్యా! బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ లనిదెలియుము.

ప్ర॥ శక్తులు అయిదేవి స్వామీ ?

ఉ॥ ఆదిశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, యిచ్ఛాశక్తి పరాశక్తులు.

ప్ర॥ ముఖములు అయిదేవియో తెలపీయుడు.

ఉ॥ సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష యీశానముఖములు.

ప్ర॥ అయ్యా! ముద్రలు అయిదేవియో కృపజేయుడు.

ఉ॥ ఓ వత్సా! భూచరి, ఖేచరి, మధ్యమ, షణ్ముఖి శాంభవి యనునవి.

ప్ర॥ వీటి లక్ష్యానుసంధానము విశదముగా దయ సేయుడు.

ఉ॥ ఓ మేధావీ! భూచరిచూపు యెట్లనగా, గడ్డము రొమ్మున్నానునట్లు ముఖమువంచి నేత్రద్వయముచే నాసికా గ్రమున తప్పక చూచుట. ఖేచరియనగా ముఖము పైకెత్తి నేత్రములచేత ఆకాశమును తప్పక చూచుట. మధ్యమ యనగా నేత్రములు సగముమూసి చూపు చెదరనీయక నాసికామధ్యమున నిరీక్షించుట. షణ్ముఖియనగా చక్షు ద్వయ, కర్ణద్వయ, నాసికాద్వయములను కర్ణములను అంగుళ ములచేతను తర్జనిమధ్యములచేత చక్షుద్వయమును అనామిక కనిష్ఠములచే నాసాపుటములున్నూ మూసి చూచునది. శాంభవియనగా కనులను బాగావిచ్చి కాటుకపక్షుల నొక టిగా జేసి భ్రూమధ్యమున తప్పకనిరీక్షించునదియని దెలియుము.

ప్ర॥ నాయనగారూ! యీముద్రలవలన మోక్షసా మ్రాజ్య మబ్బునా?

ఉ॥ ఓయీగుణశాలీ! యీ ముద్రాభ్యాసము వలన అహంకారాది దుర్గుణ సముదాయముల దర్పము లణగి మనస్సు వికారగుణములను తొలగబెట్టి నిర్మలముగా జేయుటయేగాక మనసు తనకు స్వాధీనమై చాంచల్యాది వికారముల విడచి సన్మార్గావరోధము చేయక జ్ఞానమార్గములయందిష్టముగల దియై ప్రపంచ వాసనలకు చొరకయుండు క్షేమహాఫలితమని పెద్దలు దీనిని ప్రకాశముగా పనిచేయుదురు.

ప్ర॥ అయ్యా గురునాథా! సాంఖ్యమనగా నేదియో యానతిచ్చి రక్షింపుడు.

ఉ॥ బుద్ధిశాలీ! సాంఖ్యమనగా యాత్మానాత్మ వి రణ తెలియగలందుకై నిరాకార నిర్గుణ పరబ్రహ్మముం యీ జగత్సృష్టి యెద్విధముగా గలిగెనో యది సద్గురురాయ కృపకు పాత్రులై వారి అనుగ్రహ మూలముగా ప్రపం సృష్టికి మూలమైన పరమాత్మ యొక్క స్థితిన్నీ మాయ త్రియము వలన గలిగిన సృష్టి స్థితి సంహారముల మూలవి తెలిసిన యడల "బ్రహ్మసత్యం జగన్మిధ్య" యను శృతికిప్ర క్షముగా లక్షణ లక్ష్యముల యందు విచారించగా సర్వ ఖల్విదంబ్రహ్మ యనే స్థిరత్వము గలిగించి సమరసబుద్ధిని క గించి నిర్విచారుని జేయును.

ప్ర॥ మోక్షప్రదాతవై వెల్గుగురురాయా! షట్కమ ములు యీ దేహమందున్నవియని వాటియందు అధిదే ఆద్యాక్షర జీవాక్షరములతో సహా యున్నవని కొందరివల వినియుందు. వాటినిజస్థితిని బోధించి నన్ను రక్షించగలకర్త మీరేయని ప్రార్థించెద.

ఉ॥ ఓగుణశాలీ! ఏకాగ్ర బుద్ధిచే యాలించి చూ గ్రహించి యానందించుము. ఆధార, స్వాధిష్టాన, మణిపూరక అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రములు ఇవియే షట్కమలములు

ప్ర॥ వీట్లస్థానములు దయచేయుడు.

 

ఉ॥ వరుసగా పాయు, గుహ్య, నాభి, హృదయ, కంఠ, భ్రూమధ్యములు.

ప్ర॥ అధిదేవత లెవ్వియో శెలవిండు.

ఉ॥ వినాయక, బ్రహ్మ, విష్ణు, రుద్ర, జీవ, పరమాత్మలు.

ప్ర॥ అక్షర బీజములు శెలవీయుము.

ఉ॥ ఓం న మ శి వ య, యీ ఆరుబీజములు.

ప్ర॥ దళాక్షరములేవియో శెలవిండు.

ఉ॥ ౧ వ శ ష స ౨ బ భ మ య ర ల ౩ డ ఢ ణ త థ ద ధ న ప ఫ ౪ క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ ౫ అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః ౬ హం క్షం

ప్ర॥ హంసలెక్కడెన్నియో దయచేసి రక్షింపుడు.

ఉ॥ ౧. ౬౦౦॥ ౨. ౬౦౦౦॥ ౩. ౬౦౦౦॥ ౪. ౬౦౦౦॥ ౫. ౧౦౦౦॥ ౬. ౧౦౦౦॥ మొత్తము షట్కమలములయందున్న హంసలు ౨౦౬౦౦. ఇక సహస్రమను పేరుచేత సప్తకమలముండును. దానిస్థితిని జెప్పి చూపించెద చక్కగావిచారించుము.

ప్ర॥ అయ్యా, సవిస్తరముగా దయచేసి రక్షింపుడు.

ఉ॥ ఆజ్ఞాచక్రమను కమలమునకు పైన సహస్రారమను పేరుచే ప్రకాశించుచుండును. దానినే కొందరార్యులు అష్టదళ పద్మమని చెప్పుదురు. ఎట్లనగా యెనిమిది పెద్దరేకులుగలదియై రేకుఒకటింటికి లోనభాగమున ౧౨౪ చిన్నరేకులు తర

గతులుగా చేమంతిరేకులుమాదిరిగా యుండును. ఇది సుష
మ్నాగ్రమునయుండును. దీనికధిపతి గురుమూర్తియే. (రాం
బీజముండును. ఇక్కడ ౧౦౦౦ హంసాజపగాయత్రి సమర్పిం:
బడును. మొత్తము సప్తకమలములందును ౨౧౬౦౦ హంస
జపమునడచును. సహస్రారమే ఆధారకమలము. ఊర్ధ్వముగ
నుండి అరటిమొగ్గవలె అధోముఖేక్షణము గలదియైయుండున
దీని మధ్యభాగమున పరమాత్మ జ్యోతిరాకారముగ ప్రక
శించుచుండును. ఇదియే ఆత్మజ్యోతియనియు ఆపోజ్యోతియనియు
అనేక పేర్లచే ఒప్పియుండును. ఇది బాహ్యమునకు రేకులుఅనగ
ఓష్ఠములు౨, నాసికములు౨, శ్రోత్రములు౨, నేత్రముల
౨న్నూగలసి అష్టదళ పద్మముగా గనుపడును. దీనిపైని మధ్య
నున్నా జ్యోతియనేహంస ఒక్కొక్క రేకుమీద వ్రాలినప్పుడ
ఒక్కొక్క వృత్తిపుట్టును. ఇందుకు శృతి॥ పూర్వదళేపుణ్యబుద్
ఆగ్నేయే క్షుత్పిపాసః దక్షిణాయాం పాపచింత నైరృత్యా
పరదోషారోపణబుద్ధి పశ్చిమాయాం సుషుప్తి వాయువ్యా
చలనబుద్ధి ఉత్తరే ధర్మచింత ఈశాన్యాం వైరాగ్యం క
కాయాం తురేయం ఊర్ధ్వముఖే పరమార్థం.

ప్ర॥ అయ్యా గురువర్యా! జీవుడనేవాడు ఎటుల నుద్భ
వించెనో ఉద్భవస్థాన మెయ్యదియో ఈశరీరమందు త్రిస్థానమ
లెవ్వియో శెలవిండు.

ఉ॥ శిష్యా! వెనుకజెప్పిన వృత్తులన్నియు నాత్మగాదు
ఇందుకు శృతి॥ అసంగోహ్యయమాత్మ అజరోవిచికిత్సః. అ

ములో నొకవస్తువు ప్రతిబింబించినట్లు సచ్చిదానందరూప మంతఃకరణయందు ప్రతిబింబించును. ఇందుకు ప్రమాణము॥ నిశ్ఛిద్రేదర్పణేభాతి వస్తుగర్భం వియద్భ్రమాత్. సచ్చిదానందరూపమైన బ్రహ్మము అంతఃకరణాదులతో కలసిన దని కొందరి మతము. ప్రతిబింబించిన దన్నమతమే శంకరాచార్యులవారు ఒప్పుకున్నది. ఎందుచేతననగా కలిసిపోయినయెడల విషయము లేకపోయినప్పుడు ఆత్మకూడా లేకపోవచ్చును, గనుక కలియలేదు. అంతఃకరణ శుద్ధసత్వ ప్రధానమైనిది గనుక దానియందు పరబ్రహ్మము ప్రతిబింబించినదని చెప్పినదియే అనుభవమునకు సరిగానున్నది. స్వచ్ఛమైన పదార్థమునొద్ద ఏ వస్తువునుంచితే ఆ వస్తువు ఆ పదార్థములో కలసిన ట్లగపడునేకాని కలియదు. ఈ అంతఃకరణ ప్రతిబింబున కీ అవిద్యావరణచేత జీవుడనే పేరుచేత శరీరమందు ప్రకాశించును. ఇతనే జాగ్రదవస్థయందు నేత్ర మధ్యస్థానమునుండి విశ్వుడనే పేరుచేత సమస్త వ్యాపారములును జేయించుచుండును. ఇతనే స్వప్నావస్థయందు కంఠస్థానమునుండి తైజసుడనే పేరుచేత యింద్రియములచేత కూడుకొని స్వప్న వృత్తాంతములు జరుపుచుండును. ఇతనే వ్రాత్పద్మమున స్థానముగానుండి ప్రాజ్ఞుడనే పేరుచేతను సుషుప్తి అనుభవించును. ఇతనే నాభికమలమందు నివసించి పారమార్థికుడనే పేరుచేత తుర్యానందమును బొందును. ఇతనే స్వాధిష్ఠానకమలనివాసియై పరమాత్మయనే పేరుచేత తుర్యాతీతమనే

మహదానందానుభవుడై తిరిగి హంసస్వరూపుడై జాగ్రత్తను కలిగించుతూయుండును. ఇతనే త్వం పదవాచ్యుడు.

ప్ర॥ అయ్యా గురురాయా! తత్పద వాచ్యుడైన ఈశ్వరునకు జననస్థానమెయ్యదియో అవస్థాభేదము లెయ్యవియో నామభేదములేవియో యీ రెంటి కైక్య మెక్కడనో తెలవిండు.

ఉ॥ శిష్యతిలకా! ఏకాగ్రచిత్తుండవై వినుము. ఈశ్వరుడు శుద్ధసత్వప్రధానమైన మాయయందు ప్రతిబింబించిన యీ పరమాత్మకే ఈశ్వరుడనేపేరు. ఇతనికి అయిదవస్థలుగలవు. ఈ అయిదిటియందు నామభేదములేవియన విరాట్టని, హిరణ్యగర్భుడని, అవ్యాకృతుడని, అంతర్యామియని, పరమాత్మయని నామములు. వీ రిద్దరికిని అయిదవ యవస్థయందుఒకేనామమై యున్నది. ఇదియే అసిపదమునకు లక్ష్యార్థము.

శిష్యవరా! ఇదియె పరమ రహస్యము. సందేహముంచకుము. సాదృశ్యముగా పూర్వార్య సమ్మతములు కొన్నిటి బోధింతు, విమలాత్ముండవై విని మది చెదరనీయక కుదురుపరచి ఆనందింపుము.



# సాంఖ్య ప్రకరణము

## జగజ్జీవేశ్వరోత్పత్తి

శృతి॥ అజామేకం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాంజనయంత్రీ సరూపామ్ అజో హ్యేకో జుషమాణోను శేతే జహాత్యేనాం భుక్తభోగామజోన్యః.

తా॥ బ్రహ్మసన్నిధిని సత్వరజస్తమోగుణాత్మకమై, తమోరూపమై, జడమై అనాదియగు మూలప్రకృతి మృగతృష్ణికవలె ఉన్నదై లేసిదై కానిదై తోచుచుండును.

శృతి॥ జీవేశవభాసేనకరోతి మాయాచావిద్యాచ స్వయమేవభవతి.

తా॥ ఆమూలప్రకృతి శుద్ధసత్వప్రధానయై మాయయని, మలినసత్వప్రధానయై అవిద్యయని రెండు తెరగులాయెను. అందుమాయాసంబంధమువలన అట్టి శుద్ధచిద్రూప పరబ్రహ్మము సర్వశక్తియుక్తుండై సర్వనియంత సర్వగుణపూర్ణుండై అచింత్యమహిమాన్వితుండై, ఈశ్వరుండన బరగు.

శృతి॥ తత్సృష్ట్వాత దేవానుప్రావిశత్.

తా॥ ఆ యీశ్వరతత్వసహితమైన మాయవలన అగ్నితప్తంబైన లోహము శృంఖలాది వస్తుజాతములేర్పడినట్లు, సూక్ష్మభూత తన్మాత్రలింగాదులున్ను, పృధివ్యాదిభూతంబు

లున్నూ, భౌతికంబులగు స్థూలదేహాదులున్నూ, తృణ, గుల్మ, గిరి, నద, నదీ, సముద్రాదులునగు భోగభోగాయతన రూప చరాచరవస్తుపరిపూర్ణ చతుర్దశభువనభరితంబగు బ్రహ్మాండం బుద్భవిల్లె.

శ్రుతి॥ ఆశోచయాశోచతి ముహ్యమానః.

తా॥ ఆబ్రహ్మాండమందు ఈశ్వరుడు లింగదేహంబుల ప్రవేశించి, జీవుండై అవిద్యావరణంబున భోగాయతనంబులైన స్థూలదేహంబులనుండి భోగ్యరూపంబులగు సమస్తచరాచరవస్తుజాతంబు లనుభవింపుచు అవిద్యావశుండై స్వస్వరూపంబుమరచి, విషయాసక్తుండై జననమరణప్రవాహరూపంబగు సంసారకూపంబునంబడి వెడలనేరక చచ్చుచు పుట్టుచు, కడగానక స్వర్గనరకాది సుఖదుఃఖము లనుభవింపుచూ చిక్కు పడియుండును.

ఇందుకు వివరణము:—

మొదట సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమగు నిర్గుణపరబ్రహ్మంబుగలదు. దానియందు చంద్రుని యందలి చంద్రికవలె యెడబాటులేక, యెల్లప్పుడు కూడియుండి ఆపర బ్రహ్మమునందు వ్యాపించి పరబ్రహ్మశక్తియొకటి ప్రకాశించుచుండును. అదే మూలప్రకృతి, మహాత్రిపురసుందరి. ఆమూల ప్రకృతి అమలసత్వప్రధాన, మలినసత్వప్రధాన అనెడి రెండు రూపములుగలది. దీనిలో అమలసత్వప్రధాన బ్రహ్మజ్ఞానమును,

మలినసత్త్వప్రధాన లోకవ్యవహారజ్ఞానమును గలిగించును. ఈ రెంటిలో మలినసత్త్వప్రధాన సత్త్వగుణము,రజోగుణము, తమో గుణము అనెడు మూడుగుణములుగలది. వీనిలో సత్త్వగుణము తెలుపురంగును ఉత్తమమును మాయయను పేరుగలది యగును. దీనియందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయయే ఈశ్వరుడు. ఆఈశ్వరునకు యీమాయయే కారణశరీరమును సుషుప్త్యవస్థ యును ఆనందమయకోశమును అగును. ఈ మాయోపాధిని బొందిన ఈశ్వరునకు అవ్యాకృతుడని అంతర్యామియని పేర్లు. ఈఈశ్వరుని రాజసాహంకారమే బ్రహ్మయును, సాత్వికాహంకా రమే విష్ణువును, తామసాహంకారమే రుద్రుడును, త్రిగుణ సామ్యమే ఈశ్వరుడును, శుద్ధసాత్వికాహంకారమే సదాశివు డును అగును.

రజోగుణము మెరపునిరంగును మధ్యమమును అవిద్య యను పేరుగలదియగును. దీనియందు ప్రతిఫలించిన పరబ్రహ్మ చ్ఛాయ ఈ అవిద్యచేత ఖండఖండములై కంసాలవాని మైనపుముండలోని బంగారపు లేశములవలె నానావిధ జీవు లగును. ఈ జీవులకు ఈ అవిద్యయే కారణశరీరమును సుషుప్త్య వస్థయును ఆనందమయకోశమును అగును. ఈఅవిద్యోపాధిగల జీవునకు ప్రాజ్ఞుడని పారమార్థికుడని పేరు. త్రిగుణములలో దేనియందును పరబ్రహ్మము ప్రతిఫలించనప్పుడు నిమిత్త కారణమగును. ఈ జీవేశ్వరులకు భోగసాధనములైన స్థూల

సూక్ష్మదేహములను కల్పింపదలంచి పరమాత్మ తమోగుణ మును వీక్షించెను.

తమోగుణము నల్లనిరంగును అధమమును ఆవరణశక్తి యును అగును. దీనియందు ప్రతిఫలించిన పరబ్రహ్మచ్ఛాయయే విక్షేపశక్తియగును. ఈ విక్షేపశక్తియే శబలబ్రహ్మ.

దీనివలన శబ్దగుణముగల ఆకాశముదయించెను. ఇది పరాశక్తియును అనుగ్రహకృత్యమును ఈశానముఖమును శాంత్యాతీత కలయున్నూ (య) కారమును గుండ్రని రూపమును పసుపురంగుకలదిగా నుండును. దీని కధిదేవత సదాశివుడు.

దీనివలన గలగల శబ్దము అనుష్ణాశీతస్పర్శము అనెడు రెండు గుణములుగల వాయువు యుదయించెను. ఈ వాయువు ఆదిశక్తియు తిరోధానకృత్యమును తత్పురుష ముఖమును శాంతికళయును (వ) కారమును షట్కోణాకృతియును రూపరహిత స్పర్శగుణమును ఆకుపచ్చని రంగునుగలది. దీని కధిదేవత ఈశ్వరుడు.

దీనివలన భగభగయను శబ్దము ఉష్ణస్పర్శము ఎర్రని రూపము అనెడు మూడుగుణములుగల అగ్ని జనించెను ఈ అగ్ని క్రియాశక్తియును సంహారకృత్యమును అఘోరముఖమును విద్యాకలయును (శి) కారమును ముమ్మూలలరూపమును గలది. దీని కధిదేవత రుద్రుడు.

దీనివలన బుడబుడశబ్దమును, శీతస్పర్శమును శ్వేతరూపమును మధురరసమును అనెడు నాలుగు గుణములుగల జలము పుట్టెను. ఈజలము జ్ఞానశక్తియును, స్థితికృత్యమును, వామదేవముఖమును ప్రతిష్టాకలయును (ము) వర్ణమును అర్ధచంద్రాకారమునుగలది. దీని కధిదేవత విష్ణువు.

దీనివల్ల కటకటశబ్దమును, కఠినస్పర్శమును, రక్తరూపమును, ఉప్పు మొదలగురసములును, గంధగుణమును అను అయిదు గుణములుగల పృధివి పుట్టెను. ఈపృధివి ఇచ్ఛాశక్తియును, సృష్టికృత్యమును, సద్యోజాతముఖమును, నివృత్తికళయును, (న) కారమును చతురశ్రమైన రూపమును వేడీచల్లనాగానట్టి స్పర్శమును చిత్రవర్ణమునుగలది. దీనికధిదేవత బ్రహ్మ.

ఈప్రకారముగాగల్గిన పంచభూతములయందును తొలుత జెప్పిన మలిన సత్వ ప్రధానయగు మూలప్రకృతియొక్క మూడుగుణములతో చేరి సత్వసూక్ష్మ, రజసూక్ష్మ, తమస్థూల భూతములని మూడువిధములగును. వీనిలో సత్వ రజ సూక్ష్మ పంచభూతములు అపంచీకృతములై సూక్ష్మశరీరమునకు కారణములగును. తమ స్థూలభూతములు పంచీకృతములై స్థూల శరీరమునకు కారణమగును.

## జీవేశ్వర జగదుత్పత్తి చక్రము



# సూక్ష్మ శరీర పంచీకరణ చక్రము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| సత్త్వసూక్ష్మ భూతములు. | అపంచీకృత సూక్ష్మభూతములు. | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | సత్త్వరజ స్సూక్ష్మభూతములు. | ఈశ్వర సూక్ష్మశరీరములు. |
| | సత్త్వసమిష్టి సూక్ష్మభూతములు. | మనస్సు చంద్రుడు | | బుద్ధి బృహస్పతి | | | అంతఃకరణములు అధిదేవతలు. | |
| | సత్త్వవ్యష్టి సూక్ష్మభూతములు. | శ్రోత్రము దిక్కులు | త్వక్కు వాయువు | చక్షువు సూర్యుడు | జిహ్వ వరుణుడు | ఘ్రాణము అశ్వినులు | జ్ఞానేంద్రియములు అధిదేవతలు. | |
| రజస్సూక్ష్మ భూతములు. | రజస్సమిష్టి సూక్ష్మభూతములు. | సమానము జయుడు | వ్యానము విశ్వయోని | ఉదానము అజుడు | ప్రాణము విశిష్టుడు | అపానము విశ్వకర్త | పంచవాయువు అధిదేవతలు. | జీవసూక్ష్మశరీరములు. |
| | రజోవ్యష్టి సూక్ష్మభూతములు. | వాక్కు అగ్ని | పాణి ఇంద్రుడు | పాదము ఉపేంద్రుడు | గుహ్యము బ్రహ్మ | పాయువు మృత్యువు | కర్మేంద్రియములు అధిదేవతలు. | |

జీవసూక్ష్మ దేహతత్వాధిదేవతలే, ఈశ్వర సూక్ష్మదేహతత్వములు.

# సూక్ష్మశరీర పంచీకరణ చక్ర విషయము

పంచీకృతములుగాని సత్వసూక్ష్మభూతములును రజ
సూక్ష్మభూతములును సమిష్టి, వ్యష్టి భేదంబులచేత సత్వసమిష్టి
సూక్ష్మభూతములని సత్వవ్యష్టిసూక్ష్మభూతములని రజస్సమిష్టి
సూక్ష్మభూతములని రజోవ్యష్టిసూక్ష్మభూతములనినాలుగువిధ
ములగును. వానియందు సత్వసమిష్టి సూక్ష్మభూతములైదును
అంతఃకరణమాయెను. అది లోపలిసంచారము గలదైనప్పుడు
బుద్ధి, వెలుపలిసంచారముకలదైనప్పుడు మనస్సు అని రెండు
విధములగును. సత్వవ్యష్టిసూక్ష్మభూతములు శ్రోత్రము
త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, అనెడు జ్ఞానేంద్రియము
లయ్యెను. రజస్సమష్టిసూక్ష్మభూతములైదును సమానము
వ్యానము, ఉదానము, ప్రాణము, అపానము అనెడు పంచ
ప్రాణవాయువు లయ్యెను. రజోవ్యష్టిసూక్ష్మపంచభూతములు
వాక్కు, పాణి, పాదము, గుహ్యము, పాయువు అనెడికర్మే
ద్రియములయ్యెను. ఈపదహేడు తత్వములతో కూడినది
సూక్ష్మశరీరము. దేనియందుచేరిన ఈశ్వరునకు హిరణ్యగర్భు
డని సూత్రాత్ముడని పేరు. దీనియందుచేరిన జీవునకు తైజసుడు
స్వప్నకల్పితుడని పేరు. ఈజీవేశ్వరులకు యీసూక్ష్మదేహ
మందు స్వప్నావస్థయును ప్రాణమయము మనోమయము
విజ్ఞానమయము అనెడి మూడుకోశములు గల్గియుండును.

ఎట్లనగా సూక్ష్మదేహవ్యాపారమగు స్వప్నవృత్తాంతమును మెలకువయందు జెప్పుటవలన, సూక్ష్మదేహమందు విజ్ఞానమయకోశముండును; ప్రాణధర్మములైన లేచుట,కూర్చుండుట, ముడుచుట, చాచుట, నడచుట అనెడు అయిదుపనులు అప్పుడుండుటవలన ప్రాణమయకోశముండును; మనోరాజ్యమేలుటవలనమనోమయకోశముండును. మరియునుఅంతఃకరణము ప్రాణాదివాయువులతోఁగూడిన ప్రాణమయకోశమని మనస్సు కర్మేంద్రియములతోఁగూడిన మనోమయకోశమని బుద్ధిజ్ఞానేంద్రియములతోఁగూడిన విజ్ఞానమయకోశమని గ్రహింపవలెను. కొందరు సూక్ష్మదేహమునకు తత్వములు 19 అందురు. మనస్సులో భేదమైన చిత్తమును బుద్ధిభేదమైన అహంకారమును 17 తత్వములలోఁజేర్చ 19 తత్వములగును. చిత్తాహంకారములు యెట్లుత్పత్తియనిన లోపలిసంచారముగల బుద్ధినిశ్చయవిహీనమైనవృత్తి అహంకారమనియు, బహిస్సంచారముగల మనస్సు వస్తువిమర్శనవృత్తియే చిత్తమనియును. ఈచతుర్విధముగా శోచువ్యవహారికము ఒక అంతఃకరణగానే గ్రహింపబడును.

---

# స్థూల పంచీకరణ చక్ర విషయము

శ్రుతి॥ బ్రహ్మణోరవ్యక్తః అవ్యక్తాన్మహతః మహతో హంకారః అహంకారా త్పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యోపంచమహాభూతాని పంచమహాభూతేభ్యోఽఖిలంజగత్ ఆత్మనః ఆకాశాస్సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః ఆపఃపృథివీ పృథివ్యా మోషధయః ఓషధేభ్యో రన్నః అన్నాత్పురుషః॥

శ్లో॥ ద్విధావిధాయచైకైకం చతుర్ధాప్రథమం పునః
స్వస్వేత రద్వితీయాంశై ర్యోజనాత్పంచ పంచసూ.

శ్లో॥ పంచీకృత మహాభూతా సంభవం కర్మసంచితం
శరీరం సుఖదుఃఖానాం భోగాయతన ముచ్యతే.

పంచీకృతములైన తామస స్థూలభూతము లైదును సమష్టి వ్యష్టిభేదములచేత ఒకటొకటి రెండేసిగా పంచబడి తామస సమిష్టి స్థూలభూతములని తామసవ్యష్టి స్థూలపంచ భూతములని పదివిధములగు. అందు తామసవ్యష్టి స్థూలపంచ భూతములు తమతమసమిష్టి భాగములనువిడచి యితర వ్యష్టి భూతార్ధభాగముల ఉపభాగములలో చేరుటకై ఒక టొకటి నాలుగుగా భాగింపబడి యితర భూతముల వ్యష్టిభాగముల ఉపభాగములలోచేరి ముందటి తమతమ సమిష్టిభాగములతో గూడి ౨౫ తత్వములగును.

ఈ తత్త్వములు ఒక్కటిగాకూడి అండములును, పిండము లును, భూతములును, భువనములును, భోగ్యములును ఆయెను. అండములనగా బ్రహ్మాండ, విష్ణ్వండ, రుద్రాండ, మహేశ్వ రాండ, సదాశివాండ, విరాట్పురుషాండములు. అత్తికాయవలె నుండునది బ్రహ్మాండము; అత్తికాయలు అనేకములుగల అత్తి చెట్టువలెనుండునది విష్ణ్వాండము; అత్తిచెట్లు అనేకములుగల అత్తితోటవలె నుండునది రుద్రాండము; అత్తితోటలు అనేక ములుగల గ్రామమువలె నుండునది మహేశ్వరాండము; అట్టి గ్రామములు అనేకములుగల ఒకదేశమువలె నుండునది సదా శివాండము; అట్టి దేశములు అనేకములుగల ప్రపంచమువలె నుండునది విరాట్పురుషాండము. దీనినే మాయాండ మందురు. పిండము లనగా అత్తికాయలలో నుండెడి పురుగులును విత్తు లునువలెనే బ్రహ్మాండములోనుండెడి చేతనాచేతనరూపము లైన సమస్తప్రాణుల శరీరములు. భూతములనగా అండ పిండ భువనములకు స్థానములైన ఆకాశాది మహాభూతములు. భువనములనగా పదునాలుగు లోకములు (లేక) భువనార్థ మందలి యిన్నూటయిరువదినాల్గు భువనములు. భోగ్యము లనగా సకలశరీరధారులకును భోగార్థములైన అన్నాది సమస్త భోగద్రవ్యములు. ఈసర్వమును పంచీకరణమే అగును. దీనియందు వ్యష్టిస్వరూపుడైన ఒకజీవదేహ పంచీకరణ చక్ర విషయము వ్రాయబడినది.

ఈస్థూలశరీరమునుపొందిన సమిష్టిస్వరూపుడైన ఈశ్వ

రునకు హిరణ్యగర్భుడనే పేరుపోయి విరాట్టని వైరాజసుడని పేరు. దీనిపొందిన వ్యష్టిస్వరూపుడైన జీవునకు తైజసుడనే పేరుపోయి విశ్వుడని హారికుడని చిదాభాసుడని పేరు. ఈఉభయులకు ఈశరీరమందు జాగ్రదవస్థయు అన్నమయకోశమునూ్న అగును.

ఓంనమోనమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసాంప్రదాయ కర్తృభ్యో వంశఋషిభ్యో మహద్భ్యో నమోగురుభ్యః సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి శరీర త్రియంనాహమస్మి అవస్థాత్రియనాహమస్మి సదాశివసచ్చిదానంద నిర్గుణనిరీహ నిష్కళంక నిరుపమ నిరామయ వాసుదేవపరబ్రహ్మైవాహమస్మి. దేవమయమైన దేఈశరీరము.'అష్టావచక్రా, నవద్వారదేవానాం పురయోధ్యా' అనియున్నది. 'యోవైతాం బ్రహ్మణోవేదా అమృతేనాం వృతాఃపురీ తస్మైబ్రహ్మచ బ్రహ్మచ ఆయుఃకీర్తిః ప్రజాం దధుః' అనియున్నది. శృతి॥ యావతీర్వై దేవతాస్తాస్సర్వా వేదవిధిబ్రాహ్మణేవసంతీః అనియున్నది. 'తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివేనమస్కుర్యాన్నాశ్లీలం కీర్తయేదేతయేవ దేవతాఃప్రీణాత్' అనియున్నది. 'యేదేవాదివ్యేకాదశస్థాః పృధివ్యామధ్యేకాదశస్థా ప్సుషదోమహినైకాదశస్థాస్తే దేవాయజ్ఞమిమంజుషుధ్వః' ఈప్రకారముగా గుర్తెరింగినవాడే బ్రహ్మవేత్త; వాడే సద్బ్రాహ్మణుడు.

# ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక నిర్ణయములు

| వరుస నెంబరు | అధిదేవతలు | ఆధ్యాత్మికములు | అధిభౌతికములు |
|---|---|---|---|
| ౧ | కూటస్థుడు | జ్ఞాత | జ్ఞేయము |
| ౨ | చంద్రుడు | మనస్సు | సంకల్పవికల్పములు |
| ౩ | బృహస్పతి | బుద్ధి | నిశ్చయము |
| ౪ | క్షేత్రజ్ఞుడు | చిత్తము | చంచలము |
| ౫ | రుద్రుడు | అహంకారము | అభిమానము |
| ౬ | జయుడు | సమానము | పచనాదికము |
| ౭ | విశ్వయోని | వ్యానవాయువు | పంచిపెట్టుట |
| ౮ | అజుడు | ఉదానవాయువు | మ్రింగుట మొదలైనవి |
| ౯ | విశిష్టుడు | ప్రాణవాయువు | లోపలి దిరుగుట |
| ౧౦ | విశ్వకర్త | అపానవాయువు | మలమూత్రశుక్లములను వెలికిత్రోయుట |
| ౧౧ | దశదిక్కులు | శ్రోత్రము | చతుర్విధశబ్దములు |
| ౧౨ | వాయువు | త్వక్కు | పంచవిధస్పర్శములు |
| ౧౩ | సూర్యుడు | చక్షువు | దశవిధరూపములు |
| ౧౪ | వరుణుడు | జిహ్వ | సప్తవిధరుచులు |
| ౧౫ | అశ్వనీదేవతలు | ఘ్రాణము | త్రివిధగంధములు |
| ౧౬ | సదాశివుడు | శబ్దము | ఏకదేశశబ్దము |
| ౧౭ | మహేశ్వరుడు | స్పర్శము | ఏకదేశస్పర్శము |
| ౧౮ | రుద్రుడు | రూపము | ఏకదేశరూపము |
| ౧౯ | విష్ణువు | రసము | ఏకదేశరసము |
| ౨౦ | బ్రహ్మ | గంధము | ఏకదేశగంధము |
| ౨౧ | అగ్ని | వాక్కు | త్రివిధవచనములు |
| ౨౨ | ఇంద్రుడు | పాణి | దానప్రతిగ్రహము |

| | | | |
|---|---|---|---|
| ౨౩ | ఉపేంద్రుడు | పాదము | గమనాగమనము |
| ౨౪ | ప్రజాపతి | గుహ్యము | సంయోగానందము |
| ౨౫ | మృత్యువు | పాయువు | మలవిసర్జనము |
| ఇరువదియైదు | ఈ ౨౫ అధిదేవతలు కూడినదే, సువర్లోకం | ఈ ౨౫ అధ్యాత్మికములు గూడినదే భువర్లోకం | ఈ ౨౫ అధిభౌతికములు గూడినదే భూలోకం |
| | దేవతా సంపద | మానుష సంపద | అసుర సంపద |
| | సాత్వికము. | రాజసము. | తామసము. |

ఈ మూడున్నూ గాయత్రి త్రిపాదములుగా తెలుసుకునేది. ఈ ప్రకారముగా ఆపాదతల మస్తకమున్నూ ఆధ్యాత్మిక ఆధి భౌతిక ఆధి దైవికముగా చెప్పినవితప్ప మిగిలిన నఖశిఖ పర్యంతంబైన శరీరమందు సకలావయవముల యొక్కయు వెంట్రుకలు, నరములు, ఎముకలు, ప్రేగులు, కండలు, నెత్తురు, మెదడు మొదలగువాని యొక్కయు, మనోవృత్తులగు కామము మొదలగు దుర్వృత్తుల సువృత్తుల యొక్కయు భావమును తెలసి ముప్పది ముక్కోటి దేవతామయమైనదే ఈ శరీరమని తెలుసుకున్నవారే బ్రహ్మవేత్తలు. వారే సద్బ్రాహ్మణులు. ముక్తికోరినవారు సద్గురురాయుని ద్వారా ఈ సాంఖ్యసూత్రమును చక్కగా విచారిస్తూ సద్గురువులకు చతుర్విధ శుశ్రూషభక్తి సలుపుచూ యేమరుపాటు లేక ఉన్నట్లాయెనా పూర్ణదీక్షాధికారు లగుదురు.

# స్వరూప పంచీకరణ చక్రము

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి |
|---|---|---|---|---|
| జ్ఞా | మ | బు | చి | హం |
| స | వ్యా | ఉ | ప్రా | అ |
| శ్రో | త్వ | చ | జిం | ఘ్రా |
| శ | స్ప | రూ | ర | గం |
| వాక్కు | పాణి | పాద | గుం | గుద |

# తత్వవివేకము

## ఆకాశతత్వములు.

| | | |
|---|---|---|
| ఆకాశమందు | అర్ధభాగం | మోహము |
| ఆకాశమందు | వాయువు | లజ్జ |
| ఆకాశమందు | అగ్ని | భయము |
| ఆకాశమందు | జలము | సిగ్గు |
| ఆకాశమందు | పృథివి | ఆశ |

## వాయుతత్వములు.

| | | |
|---|---|---|
| వాయువుయందు | ఆకాశము | నిలచుట |
| వాయువుయందు | అర్ధభాగం | నడచుట |
| వాయువుయందు | అగ్ని | ముడుచుట |
| వాయువుయందు | జలము | ఉండుట |
| వాయువుయందు | పృథివి | పెరుగుట |

## అగ్నితత్వములు.

| | | |
|---|---|---|
| అగ్నియందు | ఆకాశము | ఆలస్యము |
| అగ్నియందు | వాయువు | మైథునము |
| అగ్నియందు | అర్ధభాగం | నిద్ర |
| అగ్నియందు | జలము | దప్పి |
| అగ్నియందు | పృథివి | ఆకలి |

## జలతత్వములు.

| | | |
|---|---|---|
| జలమందు | ఆకాశము | శుక్లము |
| జలమందు | వాయువు | రక్తము |
| జలమందు | అగ్ని | చెమట |
| జలమందు | అర్ధభాగం | మూత్రము |
| జలమందు | పృథివి | మజ్జ |

## పృథివీతత్వములు.

| | | |
|---|---|---|
| పృథివియందు | ఆకాశము | రోమములు |
| పృథివియందు | వాయువు | నరములు |
| పృథివియందు | అగ్ని | చర్మము |
| పృథివియందు | జలము | మాంసము |
| పృథివియందు | అర్ధభాగము | అస్థి |

# అక్షర పంచీకరణ చక్రము

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | యీ 5 న్నూ పంచభూతములు | |
|---|---|---|---|---|---|---|
| మ సమష్టి | న | ణ | ఞ | ఙ | యీ 5 న్నూ ఆకాశబీజపంచకము | అంతరింద్రియములు |
| ప | త సమష్టి | ట | చ | క | యీ 5 న్నూ వాయుబీజపంచకము | ప్రాణ వాయువులు |
| ఫ | థ | ఠ సమష్టి | ఛ | ఖ | యీ 5 న్నూ అగ్నిబీజపంచకము | జ్ఞానేంద్రియములు |
| భ | ధ | ఢ | ఝ సమష్టి | ఘ | యీ 5 న్నూ జలబీజపంచకము | పంచ తన్మాత్రలు |
| బ | ద | డ | జ | గ సమష్టి | యీ 5 న్నూ పృథివీబీజపంచకము | కర్మేంద్రియములు |
| యీ 5 న్నూ ఆకాశబజతత్వ కదంబము | యీ 5 న్నూ వాయుబీజతత్వ కదంబము | యీ 5 న్నూ అగ్నిబీజతత్వ కదంబము | యీ 5 న్నూ జలబీజతత్వ కదంబము | యీ 5 న్నూ పృథివీబీజతత్వ కదంబము | యీ 5 న్నూ పంచభూతబీజ పంచకము | యీ 5 న్నూ సమస్తేంద్రియ పంచకము |

## అక్షర పంచీకరణ చక్రవిషయము

అ, ఆ, ఏ, క, చ, ట, త, ప, య, ష, ఇవి పదిన్నీ వాయు బీజాక్షరములు.

ఇ, ఈ, , ఐ, ఖ, ఛ, ఠ, థ, ఫ, ర, స, ఇవి పదిన్నీ అగ్నిబీజాక్షరములు.

ఉ, ఊ, ఓ, గ, జ, డ, ద, బ, ల, హ, ఇవి పదిన్నీ భూమిబీజాక్షరములు.

ఋ, ౠ, ఔ, ఘ, ఝ, ఢ, ధ, భ, వ, ళ, ఇవిపదిన్నీ జలబీజాక్షరములు.

ఌ, ౡ, అం, ఙ, ఞ, ణ, న, మ, శ, అః, ఇవి పదిన్నీ గగనబీజాక్షరములు.

వీనిలో అకారాది షోడశస్వరములు జీవాక్షరములును యకారాది దశాక్షరములు ప్రాణమాతృకాబీజాక్షరములును అగుటచేత వీనిని త్రోయగా తక్కిన యిరువది అయిదు వర్ణములును ఇరువదిఅయిదు తత్వములని సమయవాదులు అందరును నిర్ణయించి యుండుటచేత, వీనికి పంచభూత బీజ ప్రకారముగా పంచీకరణచక్రముపైన వ్రాసియున్నది.

## పంచభూతములయందు తోచు అధ్యానములు.

1 పృధ్వికి చతుర్దశభువన నవఖండ కురుక్షేత్ర కుంభ కోణ చిదంబర తిరుణామల కాశీ రామేశ్వర మొదలైన పుణ్య క్షేత్రాదులు అధ్యానము లున్నవి.

2 జలమునకు గంగా యమునా సరస్వతీ కావేరీ తుంగభద్రా సింధూ కృష్ణా గోదావరి మొదలైనఅధ్యాసములున్నవి.

3 అగ్నికి బడబాగ్ని జఠరాగ్ని కోపాగ్ని తాపాగ్ని మూలాగ్ని కామాగ్ని మొదలైన అధ్యాసములున్నవి.

4 వాయువునకు మారుతము ప్రచండ మారుతము తూర్పు దక్షిణ పశ్చిమ ఉత్తరపుగాలి పెద్దగాలి సుడిగాలి మొదలైనఅధ్యాసములున్నవి.

5 ఆకాశమునకు అశరీర అవకాశ మఠాకాశ ఘటాకాశ జలాకాశ గోపురాకాశ మొదలైన అధ్యాసములున్నవి.

## దశవిధవాయువులవివరము

1. వ్యానవాయువు:—ఇది నీలవర్ణము, నలుపు. నాభిస్థానమందుండి ఆపాదమస్తకము నాడులయందు వ్యాపించి అన్నరసము మొదలగు వాటియొక్క సత్తువను సమస్తనాడులకు పంచిపెట్టును.

2. సమానవాయువు:—ఇది శుద్ధస్ఫటిక వర్ణము. సర్వశరీరమందుండి అన్నాదిరసములను సర్వనాడులయందు వ్యాపింపజేయును. దేహమునకు శక్తిని పుష్టిని కలిగించును.

3. ఉదానవాయువు:— ఇది సౌదామినీ వర్ణము. కంఠమందుండి తుమ్మును దగ్గునుపుట్టించును. రుచులు గోరును. అన్నరసం ఆత్మకు పానంచేయును. కలవరించును. కలగనును.

4. ప్రాణవాయువు:—ఇది ఇంద్రనీలవర్ణము. హృదయస్థానమందుండి అంగుష్టము మొదలుకొని, వెన్నెముక

మొదటివరకు వ్యాపించి ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములచేత అన్న
మును జీర్ణమును జేయించును.

5. అపానవాయువు:—ఇది పసపువర్ణము. గుదస్థాన
మందుండి మలమూత్రముల విడపించి అధోద్వారమును
బంధించి అన్నరసమున వ్యాపించి సకలరోమ నాడులయందును
వ్యాపింపజేయును.

6. నాగవాయువు:—ఇది పీతవర్ణము. రోమనాడుల
యందుండును. చలనములేక గీతరాగాదులను జేయించును.

7. కూర్మవాయువు:—ఇది శ్వేతవర్ణము. పాదముల
యందుండును. చిక్కిపోయిన దేహమును పుష్టిచేయించును.
కన్నులను, నోరునుమూయించను తెరిపించను కర్తయైయుండును.

8. కృకరవాయువు:—ఇది రక్తవర్ణము. నాసికాగ్ర
మందుండి తుమ్ము మొదలగు ధర్మములను పుట్టించును. గమ
నము జేయించును.

9. దేవదత్తవాయువు:—ఇది స్ఫటికవర్ణము. నేత్ర
ములయందుండును. గుహ్యామందునుయుండి కూర్చుండినచోటనే
పడుకోబెట్టును, లేచినిలువంబెట్టును, వ్యక్తముగా మాట్లా
డించును.

10. ధనుంజయ వాయువు:—ఇది నీలవర్ణము. సహ
స్రారమైన బ్రహ్మస్థానమందుండి, చెవుల రంధ్రములలో
ప్రవేశించి సముద్రముభంగి ఘోషించును. చిత్రములుగా
నాదమును బుట్టించును. మరణకాలమునకు ముందుగా నిర్ఘో
షమై పోవును.

# ప్రణవపంచీకరణము.




౨

## జీవేంద్రియ సముదాయము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రజోగుణ ఆకాశము | జ్ఞా | మ | బు | చి | హం |
| ర వాయువు | స | వ్యా | ఉ | ప్రా | అ |
| ర అగ్ని | శ్రో | త్వ | చ | జిం | ఘ్రా |
| ర జలము | శ | స్ప | రూ | ర | గం |
| ర పృధివి | వా | పా | పాద | గు | పాయు |

దీనియందు ప్రతిఫలించిన పరబ్రహ్మచ్ఛాయ అవిద్య చేత ఖండఖండములై కంసాలవాని మైనపువుండలో చేరిన బంగారు లేశములవలె నానావిధజీవు లగును. ఈ జీవులకు ఈ అవిద్యయే కారణశరీరమును సుషుప్త్యావస్థయును ఆనంద మయ కోశమును అగును. ఈ జీవేశ్వరులకు ఇద్దరికి భోగసాధ నములైన స్థూలసూక్ష్మ శరీరములు కల్పింపదలచి పర మాత్మ యీ తమోగుణమును వీక్షించెను. ఇదియే శబల బ్రహ్మ. దీనివలన శబ్దగుణముగల ఆకాశ వాయు అగ్ని జల పృథ్వ్యాలు పుట్టెను. సత్వగుణ రజోగుణ తమోగుణములతో కూడియుండెను. సత్వగుణ భూతములు ఈశ్వరేంద్రియములకు

కారణమాయెను. రజోగుణ భూతములు పంచీకరించి జీవేంద్రి యములాయెను. తమోగుణ భూతములు పంచీకరించి స్థూల శరీరములకు కారణ మాయెను. ఈమలిన సత్వప్రధాన లోక వ్యవహార జ్ఞానమునకు కారణమైనది. ఇదిసత్వగుణము రజో గుణము తమోగుణము అను మూడుగుణములు గలది యయ్యెను. వీనిలో సత్వగుణము తెలుపురంగును ఉత్తమమును మాయయను పేరుగలది. దీనియందు ప్రతిఫలించిన పరబ్రహ్మ చ్ఛాయయే ఈశ్వరుడు. ఇతనికి యీ మాయయే కారణశరీర మును సుషుప్త్యావస్థయును ఆనందమయ కోశమును అగును.

## ఈశ్వరేంద్రియ సముదాయము.



సత్వగుణాకాశ కదంబము సత్వగుణ వాయుకదంబము సత్వగుణ అగ్నికదంబము సత్వగుణ భూకదంబము యివి యిరువై యిన్ని పంచతన్మాత్రాది దేవతలయిన మహేశ్వర సదాశివ రుద్ర విష్ణు బ్రహ్మలు సమేతు యిరువై అయి దున్న బ్రహ్మాండ కర్తయున్న సర్వజ్ఞుడైన ఈశ్వర ప్రేరేపణ చేత తన స్వకీయేంద్రియములైన సత్వగుణ కదంబము యిరువై అయిదింటిని జీవస్థూల సూక్ష్మములకు అధిదేవతలుగా యివ్వ బడెను.

## పంచభూత వివరము

కం॥ చదువుట వ్రాయుట లెరుగను
సదమల మద్గురుకటాక్ష•సాహాయ్యమునన్
చెదరక నిటునే వ్రాసితి
పదిలంబుగ వీటిలోని • భావము గనుడీ.

శ్లో॥ పరమాద్వైతవిజ్ఞానం కృపయావై దదాతియః,
సోయం గురుగురుస్సాక్షాత్ శివయేవ నసంశయః.

1. పృథివి, ఆపః, తేజః, వాయుః, ఆకాశః యివి పంచ భూతాలు. పృథివి రక్తవర్ణం- ఉదకం శ్వేతవర్ణం- అగ్ని కృష్ణ వర్ణం- వాయువు ధూమ్రవర్ణం- ఆకాశము పీతవర్ణము- ఇవి వర్ణములు

2. పృథివి అంగుష్టన్నర- ఉదకం అంగుష్టం- అగ్ని అర అంగుష్టం- వాయువు పాతిక అంగుష్టం- ఆకాశం అణు మాత్రం-యివి ప్రమాణములు.

3. పృథివికి క్రియాశక్తి- ఉదకానకు జ్ఞానశక్తి-అగ్నికి ఇచ్ఛాశక్తి- వాయువునకు చిచ్ఛక్తి- ఆకాశానకు పరాశక్తి- యివి పంచశక్తులు.

4. పృథివికి (ల) కారం- ఉదకానకు (వ)కారం-అగ్నికి (ర) కారం- వాయువునకు (య) కారం- ఆకాశానకు (హం) కారం- యివి బీజములు.

5. పృథివికి అహంకారం- ఉదకానకు చిత్తం- అగ్నికి బుద్ధి- వాయువునకు మనస్సు- ఆకాశానకు జీవుడు- యివి గుణములు.

6 పృథివికి త్రికూటపీఠం- ఉదకానకు హాటకపీఠం- అగ్నికి కొల్లాటపీఠం- వాయువునకు హృత్పీఠం- ఆకాశానకు బ్రహ్మపీఠం- యివి పీఠాలు.

7. పృథివికి నేత్రస్థానం- ఉదకానకు నాభిస్థానం- అగ్నికి కంఠస్థానం- వాయువునకు హృదయస్థానం- ఆకాశానకు మూర్ధస్థానం- యివి స్థానములు.

8. పృథివికి బ్రహ్మ- ఉదకమునకు విష్ణువు- అగ్నికి రుద్రుడు- వాయువునకు ఈశ్వరుడు-ఆకాశానకు సదాశివుడు- వీరు అధిదేవతలు.

9. పృథివికి జాగ్రదవస్థ- ఉదకానకు స్వప్నావస్థ- అగ్నికి సుషుప్త్యవస్థ- వాయువునకు తుర్యావస్థ- ఆకాశానకు సహజావస్థ- యివి అవస్థలు.

10. పృథివికి సద్యోజాతముఖం- ఉదకమునకు వామదేవముఖం- అగ్నికి అఘోరముఖం- వాయువునకు తత్పురుషముఖం- ఆకాశానకు యీశానముఖం- యివి ముఖములు.

11. పృథివికి తారకం- ఉదకానకు దండకం- అగ్నికి కుండలీ- వాయువునకు అర్ధచంద్రాకారం- ఆకాశానకు బిందువు- యివి రూపములు.

12. పృథివికి ప్రాణం- ఉదకానకు అపానం అగ్నికి ఉదానం- వాయువునకు వ్యానం- ఆకాశానకు సమానం- యివి వాయువులు.

13 పృథివికి అధః- ఉదకానకు ఊర్ధ్వః- అగ్నికి సరళం- వాయువునకు అగోచరం- ఆకాశానకు నిరామయం- యివి ఉచ్చారణలు.

14. పృథివికి స్థూలం-ఉదకానికి సూక్ష్మం-అగ్నికి కారణం - వాయువునకు మహాకారణం-ఆకాశానికి కైవల్యం- యివి తనువులు.

15. పృథివికి హ్రస్వం-ఉదకానికి దీర్ఘం-అగ్నికి ప్లుతం- వాయువునకు అర్ధం-ఆకాశానకు అనుచ్చారణ-యివిమాత్రలు.

16. పృథివికి ఋక్కు-ఉదకానికి యజుస్సు-అగ్నికి సామము-వాయువునకు అథర్వణం-ఆకాశానకు సూక్ష్మం- యివి వేదములు.

17. పృథివికి రజస్సు-ఉదకానికి సత్వం-అగ్నికి తమస్సు-వాయువుకు శుద్ధసత్వం-ఆకాశానికి నిర్గుణం-యివి గుణములు.

18. పృథివికి సృష్టి-ఉదకానకు పాలనం-అగ్నికిసంహారం-వాయువునకు సూర్యక్రియ-ఆకాశానకు చంద్రక్రియ-యివి క్రియలు.

19. పృథివికి పూర్వదిక్కు, యింద్రుడు - ఉదకానకు పశ్చిమదిక్కు,వరుణుడు-అగ్నికి దక్షిణదిక్కు,యముడు-వాయువునకు ఉత్తరదిక్కు, కుబేరుడు-ఆకాశమునకు ఊర్ధ్వదిక్కు, బ్రహ్మ-యివి దిక్కులు అధిదేవతలు.

20. పృథివికి నైరుతికోణం, రాక్షసః - ఉదకానకు యీశానకోణం, యీశానః - అగ్నికి ఆగ్నేయకోణంఅగ్నిః-వాయువునకు వాయవ్యకోణం, వాయవ్యః - ఆకాశానికి అంతరిక్షం, విష్ణుః - యివి కోణములు, అధిదేవతలు.



# తారక ప్రకరణము

## పరబ్రహ్మ స్థానముయొక్క వివరము.

ఈ దేహమందున్న ద్విదళపద్మమందు హంసస్వరూపమై లీలారూపవినోదుండై జ్యోతిరూపమై సర్వజీవులయందు నేత్రరూపమై సాక్షిగా దేనిచేత చూస్తూయున్నాడో ఆచూపే సుషుమ్నయనే బ్రహ్మరంధ్రం. ఇదే నిశ్చయం.

ఈ దేహమందు నేత్రరూపమై జ్యోతిర్మయమై సూక్ష్మరూపమై అండస్వరూపమై సర్వేశ్వరుండు మెరుపు తళుకు చందంబున వెలుగుతూయున్నాడని వేదములయందున్నూ శాస్త్రములయందున్నూ ప్రమాణ్యములు పలుకుతూయున్నవి గనుక ఈ దేహమందున్న నేత్రమే బ్రహ్మస్థానమై బ్రహ్మము వెలుగుతూయున్నది.

ఇందుకువివరము :—

నేత్రములయందున్న నలుపు ప్రకృతిభావం జీవు డనిపించుకొనును. కంటిలో హంసమార్గమైయున్న దృష్టికిమధ్యను విరాట్పురుషునకు ఆశ్రమస్థానం. కంటిపాప మధ్యనున్నవాడు పరమస్వరాట్. కంటిలోయున్న తెలుపు ఈశ్వరస్వరూపం. ఆ తెలుపే చంద్రమండలం. ఆ తెలుపే గంగానది. ఇచ్చట తామసాహంకారముండును. ఇక్కడ (మ) కారం మాత్రుకై

యుండును. ఇక్కడనే ఈశ్వరుడున్నూ క్రియాశక్తిన్నీ వుండును. ఇతడు లయకర్త. ఇదే శివపదం. కన్నులయందున్న నలుపులో నీలవర్ణము విష్ణుస్వరూపము. ఆ నీలవర్ణమే అగ్ని మండలం, అదే యమునానది. ఇక్కడ సాత్వికాహంకారముండును. (ఉ) కారం మాత్రకై యుండును. ఇక్కడ విష్ణు దేవుడున్నూ జ్ఞానశక్తిన్నీ యుండును. ఇతనికి హిరణ్యగర్భుడనే పేరుగలిగి యున్నది. ఇతడే పోషణకర్త. ఇదే విష్ణు పదం. నేత్రములోయున్న మెరుపే బ్రహ్మస్వరూపం. అదే సూర్యమండలం. ఆ మెరుపే బ్రహ్మతేజము. పుటంవేసిన బంగారపుకాంతిగా యుండును. అదే సరస్వతి. ఇక్కడ రాజసాహంకారముండును. ఇక్కడ (అ) కారం మాత్రకై యుండును. ఇక్కడ ఇచ్ఛాశక్తియును, బ్రహ్మదేవుడున్న వుండును. ఇతడే సృష్టికర్త. ఇదే బ్రహ్మపదము. నేత్రములో తెలుపు, మెరుపు, నలుపు, నీలవర్ణములో చుక్కనడుమను పీతవర్ణమై పాపవలె నీలరూపమై బంగారపుకాంతిగలిగి మెరుపు తళుకుచందంబున వెలుగుతూయున్నదే పాపరూపము. అపాపే పరబ్రహ్మము, కంటిలో పరమాత్మ. ఆపాపే యాత్మయనబడును. ఆపాపే పరంజ్యోతి; ఆపాపేపరమేశ్వరుడు; ఆపాపే యోగంటి గురుడు. అదే వైకుంఠము, అదేకైలాసము. కంటిలోయున్న దృష్టే బ్రహ్మరంధ్రము. ఇదే దశమరంధ్రం, ఇదే బ్రహ్మ నాడి, ఇదే సుషుమ్నానాడి; ఇదే ముక్తిద్వారం. ఈదృష్టే

ముక్తికాంతాస్థానం. ఇదే శృంగాటకము. ఇదే త్రికోణస్థానం, ఇదే త్రివేణీసంగమస్థానం, ఇదే మేరుశిఖరం, ఇదే కుండలీస్థానం ఇదేకర్ణికాంతరం, ఇదే చిన్మయపాత్ర, ఇదేఆజ్ఞేయం, ఇదేసహస్రారం, ఇదేయెనిమిది వర్ణములదళము - ఇదే ద్విదళము, ఇదే నాదబిందుకళావాసం; ఇదే ఆపోజ్యోతి ఇదే నాలుగుత్రోవల నడుమ, ఇదేకొల్లాటమంటపం, ఇదే ముమ్మూలలపురం, ఇదేసోమసూత్రము, ఇదే నీలతోయదమధ్యస్థం, ఇదే రమాకాంతస్థలం, ఇదేపశ్చిమమార్గం, ఇదేమోక్షద్వారం, ఇదేఓంకారము. ఇదే నాసికాగ్రమనిన్నీ, ఇదే భ్రూమధ్యస్థమనిన్నీ, ఇదే తూర్పుబయలు అనిన్నీ, ఇదే దృక్కు అనిన్నీ, ఇదే దృశ్యమనిన్నీ, ఇదే పరమహంసయనిన్నీ, ఇదే శాశ్వతపదవియనిన్నీ, ఇదే పరమపదమనిన్నీ, ఇదే ఐక్యస్థానమనిన్నీ, ఇదే జీవన్ముక్తియనిన్నీ, ఇదే జన్మరాహిత్యమనిన్నీ. "నచపునరావర్తతే నచపునరావర్తతే" యను శృతి ప్రమాణముగా యీభావమందు ఐక్యమైనవానికి పునరావృత్తిలేదు గనుక ఇదే శుద్ధరాజయోగసిద్ధాంతము. ఇది నమ్మిమనోదృష్టులను లీనముచేయవలయును.

ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానమే జ్ఞాతృత్వము. స్థూలదేహము, అండాండము, సత్వగుణము, శ్వేతవర్ణము, పీతప్రకాశము ఇవి పితృమాతృదేహములు. నాద బిందు యివి రెండున్నూ రెండు దేహములు. కాబట్టి బ్రహ్మస్థానమనిపించుకొనును.

## షడాధార ధ్యానక్రమము

ఆసన స్థానంబునందు ఆధార చక్రమనునది చతుర్దళ యుక్తంబైన, వ, శ, ష, స, యను బీజాక్షరంబులవలన నర్ధచంద్రా కారంబును పృధివిభూతంబును కుంకుమవర్ణంబును కింకిణీనాదం బును ఆరు నూరుహంసలును సద్భక్తియును క్రియాశక్తియును కలిగియుండు గణేశునకు మానసంబుచేత షోడశోపచారపూజలు చేసి యతనికరుణగాంచి రెండంగుళములపైన నేతెంచిచూడగా లింగస్థానంబున స్వాధిష్టానచక్రంబును ఆపోభూతంబునంటి త్రికోణాకారంబై యుండును. దీనికి బ, భ, మ, య, ర, ల, సహితంబైన షడ్దళంబులుయుండును. అందు నైష్ఠికభక్తియు జ్ఞానశక్తియు విమలంబైన విద్యుత్కాంతియును వీణారవంబును ఆరువేలుహంసలు నటించుచుండ అందువాసంబైన చతుర్ముఖ బ్రహ్మకు షోడశోపచారంబులగు పూజలొనర్చి యతని యనుమతివడసి నాభిస్థానంబునకేతెంచి చూడగా నందు నగ్ని భూతంబునునంటి మణిపూరకంబను చక్రంబు షట్కోణంబై దశదళములుగలవు. అందు డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ యను బీజాక్షరములు గలిగియుండును. మరియు వేణు నాదంబును, శ్యామలవర్ణంబును, యిచ్ఛాశక్తియును, ఆరువేల హంసలుగల కుండలీస్థానంబునందుండు విష్ణువునకు షోడశోప చారపూజలు మానసికంబుగా నొనరించి అతని కటాక్షవీక్ష ణంబుల గాంచి హృదయకమలంబున కేతెంచి వర్తులాకారం బైయనాహతచక్రము వాయుభూతంబు నంటియుండెడి

సంజ్ఞలంగని యందు క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, యను అక్షర సంజ్ఞలుగలిగిన ద్వాదశదళంబులుండు. అద్దానిలో నాదిశక్తియును, అనుభవభక్తియును, శాతకుంభపు కాంతియును, శంఖారవంబును ఆరువేల హంసలు నాడుచుండు. అందుండు రుద్రమూర్తిని చూడగాంచి యతనికి మానసికంబుగా షోడశోపచార పూజలుసలిపి యతని వరప్రసాదంబు చేకొని తాలుమూలల స్థానంబునందుండు విశుద్ధ చక్రంబు నంటియుండెడి యాకాశభూతంబునుగాంచి షోడశ స్వరంబులును షోడశదళంబులుగానుండు. అందు అ, ఆ, లు పదహారున్నూ బీజాక్షరంబులుగలిగి పరాశక్తియును స్ఫటికవర్ణంబును ఆనంద భక్తియును మేఘనాదంబును పది నూర్ల హంసలు నాడుచుండెడి సంజ్ఞలం గని యందు వసించియుండెడి ఈశ్వరుని సేవించి కరణత్రయంబుచే షోడశోపచారపూజలు సల్పి అతని కరుణవడసి నాసాగ్రంబునకు జేరి నేత్రద్వయ మధ్యంబుగా నాజ్ఞేయ చక్రంబునకు రెండు రేకులుగలిగియుండు. అక్కడ హాం. క్షం. అనెడు అక్షరములును అబ్ధినాదంబును మహాతత్వభూతంబును మాణిక్య కాంతియును సమరసభక్తియును గంగా, యమునా, సరస్వతుల సంగమస్థానంబుగానుండు. అందు హంసలు పదినూర్లు ఆడుచుండు అచ్చోటు విలక్షణం బై యుండెడి సదాశివుని దర్శించి యతనికి షోడశోపచారపూజలుగావించి యవ్వాని కృపబడసి మూర్ధ స్థలంబైన సహస్రారమునకుంజేరి చూడగా నందు వేయిదళ

ములును ఓంకార బీజమైన ఏకాక్షరంబును ఝుంకారనాదం బును బహువిచిత్రవర్ణంబులును పరమభక్తియును సహస్ర హంసలును సాక్షిభూతంబగు నాత్మయు నుండు. అట్టి యాత్మ తానై యుండువాడే సచ్చిదానంద సద్గురుమూర్తి. ఇట్టి యను భవమును శ్రీగురుద్వారా తెలిసికొని ఈ షడాధారములను సేవించి అనుభవజ్ఞులు కావలెను.

## నాడీచక్ర విషయము

మరియు మూలాధారంబుకంటె రెండంగుళములు మీదను స్వాధిష్ఠానంబుకంటె రెండంగుళములదిగువను కుక్కు టాండంబువలె నాడీచక్రముండును. దానియందు డెబ్బదిరెండు వేల నాడులు పుట్టి కొన్ని మీదుగను కొన్ని క్రిందుగను కొన్ని ప్రక్కలను భూమియందు నదులవలె శరీరంబున వ్యాపించుకొని యుండును. వానిలో పదినాడులు ముఖ్యములు. అందు కుహూ,సినీవాలీ, రక్తావహ్యాయంబుల నెడు మూడునాడులు క్రిందుగాపారి కుహూనాడి మలంబును సినీవాలినాడి మూత్రం బును రక్తావహ్యాయనాడి శుక్రశోణితంబులను విసర్జనముచేయు చుండును. పూషాలం అలంపూష అను రెండునాడులు కర్ణ ములయందుచేరి వర్ణధ్వని స్వరమిశ్రరూపంబులైన శబ్దం బుల వినజేయుచుండును. గాంధారి, హస్తిజిహ్వా అను నాడులు కన్నులలో వ్యాపించి దశవిధరూప గ్రహణంబు చేయించుచుండును. మరియు బ్రహ్మదండికి కుడి యెడమ పార్శ్వములయందుండెడి యిడ పింగళ యను నాడులు హృద

యముదాక వచ్చి ఆ హృదయమందలి ప్రాణవాయువు తోడ భ్రూమధ్య మందుచేరి గంగ, యమున యను పేర్లుగలవి యగును. అందు సూర్యుడను పేరుగల యిడానాడి కుడినాసిక యందు జేరి తపిని, తాపినీ, ధూమ్రి, మరీచీ జ్వాలినీ, రుచి, సుషుమ్న, భోగద, విశ్వబోధినీ, ధారుణి, క్షమ, అనెడు పండ్రెండు పేళ్ళుగల పండ్రెండంగుళముల వరకు ప్రాణవా యువును వెలుపల తిరుగజేసి వానిలో నాలుగంగుళములు క్షీణింపజేసి యెనిమిది అంగుళములదాక ప్రాణవాయువును మరల లోపలి కీడ్చుకొనును. చంద్రుడను పేరుగల పింగళనాడి యెడమనాసికలో జేరి ప్రాణవాయువును అమృత, మానద, పూష, తృష్టి, పుష్టి, రతి, ధృతి, శశినీ,చంద్రికా,కాంతీ, జ్యోత్స్న శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, పూర్ణామృత అను పదియారు పేళ్లు గల పదియారంగుళముల పొడవున వెలుపల వ్యాపింప జేసి యెనిమిదంగుళములు క్షీణింపజేసి యెనిమిది అంగుళముల దాక ప్రాణవాయువును లోపలి కీడ్చుకొనును. మరియు సూర్యచంద్ర సంజ్ఞలుగల ఇడాపింగళనాడులు రెండును ఒకది నమున ఇరువదిఒక్క వెయ్యి ఆరునూరుమారులు ఉచ్ఛ్వాస నిశ్వాస రూపంబులచేత మారిమారి పలుమారు తిరుగుచుం డును. నాడీ చక్రమందు పుట్టిన శుక్లనాడి సుషుమ్న, కుండలీ, శక్తి, నాగకన్యక, బ్రహ్మనాడి అనుపేళ్లుగలదియై వక్షస్థలంబు దాకవచ్చి నాడీచక్రంబునుండి తనతోడవచ్చిన నూరునాడుల నక్కడ విడచి తాను నాలుకకొనను చేరి సరస్వతియనుపేరు

వడసి కొండనాలుక, దవడలు, మెడ, తల, పండ్లు, పెదవులు, నాసిక, మిశ్రిములు అను యెనిమిది స్థానంబులయందు యేబది యొక్క అక్షరములను పలికించుచూ అచ్చట నణగి అంతర్గమ నంబున పశ్చిమ మార్గంబుగ భ్రూమధ్యంబునకు దిగి ముందటి ఇడా పింగళలలో సంగమమగును.

## చక్రముల కాలపరిమితి

1. మూలాధారచక్రమందు దళాలు 4 కి హంసలు 600. దళం 1 కి 150 చొ॥ అయినకాలం ఘడియన్నర ఒక క్షణం.

2. స్వాధిష్ఠానచక్రిమందు దళాలు 6 కి హంసలు 6000. దళం 1 కి 1000 చొ॥ అయినకాలం 16 ఘడియలన్నర ఒక క్షణం.

3. మణిపూరకచక్రిమందు దళాలు 10 కి హంసలు 6000. దళం 1 కి 600 చొ॥ అయినకాలం 16 ఘడియలన్నర ఒకక్షణం.

4. అనాహతచక్రమందు దళాలు 12 కి హంసలు 6000. దళం 1 కి 500 చొ॥అయినకాలం 16 ఘడియలన్నరఒకక్షణం.

5. విశుద్ధచక్రిమందు దళాలు 16 కి హంసలు 1000 దళం 1 కి 62½ చొ॥ అయినకాలం 2 ఘడియలన్నరఒకక్షణం.

6. ఆజ్ఞాచక్రిమందు దళాలు 2 కి హంసలు 1000. దళం 1 కి 500 చొ॥ అయినకాలం 2 ఘడియలన్నరఒకక్షణం.

7. సహస్రారచక్రమందు దళములు 1000 కి హంసలు 1000. దళం 1 కి 1 చొ॥ అయినకాలం 2 ఘడియలన్నర ఒకక్షణం.

రాత్రి పగలు కలిసిన ఒకదినమునకు హంసలు 21600. ఘడియలు 60 కి ఝాములు 8.

## రాజయోగ సూక్ష్మం

1. రక్త, శ్వేత, కృష్ణ, సునీలములు నాల్గున్నూ, జీవవర్ణాలు అయిన జీవతనువులు. ఇవి స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములు వీటియందు అంతర్యాతికమైన విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతి, స్వరాట్, తనువులు. జీవసంబంధమైన రక్త, శ్వేత, కృష్ణ, నీలవర్ణములు త్వంపదం.

2. ఈశ్వరసంబంధమైనపీత, కర్బుర, శ్యామ, సునీలాలు. తత్పదం.

3. వీటిమధ్యయుండెడి శిఖాస్వరూపమే అసిపదం. ఇదే రాజయోగం.

4. నీలమధ్యమముగా యుండే బిందువే గంగ. నీలమధ్య విద్యుల్లేఖే సరస్వతి. ఆబిందువే కుండలి, శిఖయే నాదము. శిఖామధ్యమముగాయుండే అంగుష్ఠమాత్రపురుషుడే కళాస్వరూపము, మేరువే త్రివర్ణాలు, త్రివర్ణాలే మూర్తిత్రయం బిందు నాదకళలు, ఆరుచక్రాలున్నూ అక్కడనే. మేరుస్థానమే అండము; బిందువే పిండము; తేజస్సే బ్రహ్మాండము.

## సూక్ష్మదేహ వివరము

అహంబ్రహ్మ. అహం నేననేటటువంటి జ్ఞాతృత్వమే సూక్ష్మదేహము. విష్ణుస్థానము రజోగుణము శ్వేతపీతవర్ణములు కలిస్తే నీల ముత్పత్తి ఆయెను. ఇది పిండాండము. ఇంకను బ్రహ్మాండం. యిందులోనే వివరము చెప్పుచున్నది. తత్వమసి. త్వం తత్ అసి. త్వం అనేటటువంటిదే బ్రహ్మం డానికి వివరం. ఈ బ్రహ్మాండమందే సకలభూతములకు దృక్పదార్థమై చూస్తూయున్నది గనుక భ్రాంతికి హేతువయ్యెను. భ్రాంతివల్లనే జనన మరణములకు హేతువయ్యెను. తత్ త్వం అనేటటువంటిదే దృక్పదార్థమై చూస్తూయున్నది గనుక దృశ్యమనేభ్రాంతి పుట్టెను. త్వం తత్ అనే యీరెంటిని యేది తెలుసుకొంటున్నదో అదే అసిపదం అనిపించుకొనును. అదే బ్రహ్మరంధ్రం. అదే త్రివేణీ సంగమం. అదే ముక్తిద్వారం. అదే నాదబిందుకళావాసం. అదే త్రికూటస్థానం. ఇదే మహాకారణ మనిపించు కొనును.

## జీవప్రకృతి బ్రహ్మవిచారణకు

## అధ్యాత్మ అధిభౌతిక అధిదైవాలకు వివరం

1. జీవుడు అధ్యాత్మ. ప్రకృతి అధిభూతము. పరబ్రహ్మ అధిదైవతము. రాజసగుణం అధ్యాత్మ, తామస గుణం అధిభూతము, సాత్వికగుణం అధిదైవతము.

2. జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మ = ఆత్మత్రియం.

3. స్థూల, సూక్ష్మ, కారణ = తనుత్రియం.

4. రాజస, తామస, సాత్విక = గుణత్రియం.

5. బ్రహ్మ, విష్ణు, రుద్ర = మూర్తిత్రియం.

6. దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసన=వాసనాత్రియం.

7. జాగ్రత్, స్వప్న, సుషుప్తి=అవస్థాత్రియం.

8. షోడశకళలకు వివరం. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, వాక్, పాణి, పాద, గుహ్యా, ఉపస్థలు 15 న్నూ మనస్సు ఒకటిన్ని గలసి 16 తో గూడినదే లింగశరీరము. దీనినే షోడశకళాత్మక మని చెప్పుదురు.

9. షోడశకళావర్ణములు. శబ్దం స్ఫటికవర్ణం, స్పర్శం ధూమ్రవర్ణం, రూపం కృష్ణవర్ణం, రసం శ్వేత వర్ణం గంధం పీతవర్ణం, త్వక్కు గౌరవవర్ణం, చక్షుః కృష్ణవర్ణం, శ్రోత్రం హరితవర్ణం, జిహ్వా రక్తవర్ణం, ఘ్రాణం, శ్వేతవర్ణం, వాక్కు, నీలవర్ణం పాణి, హరిత వర్ణం, పాదం కృష్ణవర్ణం, పాయువు రక్తవర్ణం, ఉపస్థ కర్బురవర్ణం, మనస్సు మేరువర్ణం, యివే షోడశవర్ణములు.

10. పంచభూతములయందువుండే జడము ప్రకృతి. ఆచేష్టలే లింగాలు. వాటిసామర్థ్యమే శక్తులు. వాటిఉనికిపట్లే పీఠాలు. వాటిపుట్టుకలే నరాలు. వాటివృత్తులే అవస్థలు. వాటిని ఆడించేకర్త అది. వీటికి వ్యతిరిక్తమైన తేజస్సే బ్రహ్మ. వాటిఅభిమానమే ముఖాలు. అజపగాయత్రి తనకు తానే అర్పణ అవుతూయున్నది.



# అమనస్కప్రకరణము

## భూతలయము

మలిన సత్త్వప్రధాన ప్రకృతియొక్క, సత్త్వరజస్తమో గుణములు మూడును పంచభూతములతోఁ గూడుటవలన సాత్త్వికపంచభూతములని రాజసపంచభూతములని తామసపంచ భూతములని మూడువిధములగును. అమలిన సత్త్వప్రధాన ప్రకృతి బ్రహ్మవిచారణయందు అంతర్ముఖము కలదగును. అప్పుడు గుణవిజృంభణ మణగును, అందు పంచభూతములు త్రిగుణములతోఁడి కలయిక మాని తొలుతకలిగినవి కలిగిన తీరుననే సూక్ష్మాతిసూక్ష్మభూతములై నిలుచును.

## సూక్ష్మాతి సూక్ష్మపంచభూతలయము

ప్రళయకాలమందున్నూ, బ్రహ్మనిష్ఠయందున్నూ, పంచభూతములు లయించును. ప్రళయకాల భూతలయమువలన జన్మములకు కారణములైన ఆగామి సంచిత ప్రారబ్ధకర్మములు లయింపక ప్రళయాంతములయందు మరల జన్మము గలుగ జేయును. బ్రహ్మవిచారమువలన పంచభూతములును జన్మ కారణములైన త్రివిధకర్మములును లయించుటవలన ముక్తు లగుదురు. ప్రళయకాలమున సముద్రమందు మట్టిపెళ్ల గలిసి తన రూపముచెడినట్లు నూరంతలు హెచ్చుగాగల జలమందు ఒకభాగమైన భూమిచేరి భూమియనుపేరు బోయి జలభూతము

నిలుచును. కాలిన ఇనుపముద్దమీద నీటిచినుకు బడి నమసినట్లు నూరుపాళ్లు హెచ్చుగాగల అగ్నియందు ఒక్కభాగమైన జలముచేరి నశించి అగ్నిభూతమునిలచును. మహావాయువుచేత దీపముచల్లారినట్లు నూరంతలు హెచ్చుగా గల వాయువునందు ఒకపాలైన అగ్నిచేరిలయించి వాయుభూతమునిలచును. ముక్కు లోగాలి వెలుపలికివచ్చి తెలియనట్లు నూరుమడుగులు హెచ్చుగాగల ఆకాశమందు ఒకభాగమైన వాయువుచేరి వాయువనెడి పేరు చెడి ఆకాశభూతమునిలచును. కారుచీకటియందు మిన్ను మన్ను కన్నులకు తెలియనట్లు నూరుహంశములు యెక్కువగా గల విక్షేపశక్తియందు ఒకపాలైన ఆకాశము లయించి విక్షేప శక్తి నిలచును.

## సూక్ష్మశరీర తత్వలయము.

(జీవసూక్ష్మ దేహతత్వాధి దేవతలే ఈశ్వర దేహ సూక్ష్మ తత్వములని తెలియవచ్చును.)

స్థూలశరీరము కర్మజమగుటవలన కర్మము క్షీణించెనేని స్థూలదేహము క్షీణించును. సూక్ష్మదేహము సహజమగుట వలన కత్తులచేత నరకబడక, నీళ్లచేత నానక, నిప్పుచేత కాలక, గాలిచేత శోషింపక, వృత్తిప్రళయ, నిత్యప్రళయ, దేహ ప్రళయ, మనుప్రళయ, బ్రహ్మప్రళయ, విష్ణుప్రళయ, రుద్ర ప్రళయ, మహేశ్వరప్రళయ, సదాశివప్రళయ విరాట్పురుష ప్రళయములందున్నా చెడక నిదేహ ముక్తిపర్యంతముండును.

ఇది చెడినగాని ముక్తి గలుగదు. ముక్తి గోరినవాడు ముందుగా దీనిని చెరుపగోరక కారణశరీరమును చెరపవలెను. అది భ్రాంతిజమగుటవలన అపరోక్షబ్రహ్మసాక్షాత్కార జ్ఞానముచేత భ్రాంతి నశింపజేసెనేని భ్రాంతివలన గలిగిన కారణశరీరము నశించును. మరి ఈ సూక్ష్మదేహము పైన జెప్పిన ప్రళయములయందు నశింపక కారణశరీరమందు జేరి కారణశరీరభ్రమ నివారించుదాక కాలకర్మవశముచేత మాటి మాటికి పుణ్యపాపమిశ్రమకర్మలభ్యమగు దేవ పశు పక్షి క్రిమి జలచర, స్థావర, మానుష, స్థూలశరీరములతో కూడుచూ వీడుచూయుండును. కారణశరీరభ్రమ నివారించువేళ కారణ శరీరము నశించగానే కారణశరీరమందు నిల్వ చోటులేక, స్థూల శరీరమందున్నా నిల్వ తావులేక, కాష్టరహితమగు వహ్ని చందంబున లయించును. అప్పూడా శరీరతత్వములు సమిష్టి, వ్యష్టి భేదములతోడ క్షీణించి సత్వ రజోభూత తన్మాత్రలై యుండును.

## ప్ర కృ తి ని ల య ము

చిదాభాసరూపమైన మలినసత్వప్రధాన ప్రకృతి గుణములగు సత్వరజస్తమస్సులు మాయ అవిద్య ఆవరణ శక్తులనెడు పేర్లుగలవై వెలయును. పరబ్రహ్మచ్ఛాయ మాయ, అవిద్య ఆవరణ శక్తులందు ప్రతిబింబించుటచేత ఈశ్వరుడును జీవసమూహామును వీరికి భోగసాధనములను కలుగజేయుటకు కారణమైన విక్షేపశక్తియును తోచును.

ఇట్టి మలిన సత్వప్రధాన ప్రకృతి అచిత్తగుటవలన విచారదృష్టియందు మిథ్యాభూతమై తనకు జనకస్థానమైన చిత్ప్రకృతియందు తన త్రిగుణములతోడ కలియగా అపుడు ఈశ్వర జీవవిక్షేపములు మూడును క్షీణించి అమలసత్వప్రధాన యగు చిత్ప్రకృతి నిలచును. అది సద్రూపుడును అస్మచ్ఛబ్ద ఆత్మశబ్ద లక్ష్యార్థవాచ్యుడును, స్వజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యుడును, స్త్రీ పుం నపుంసలింగ రహితుడును, సర్వ కార్యకారణ విలక్షణుడును, కేవల నిర్గుణుడును అగు పరమాత్మయందు లయించును.

ప్రకాశోష్ణశక్తులును అగ్నియును ఒక్కటైనట్లు, ఈ చిత్ప్రకృతియును చిద్రూప పరబ్రహ్మమును ఒక్కటే యని తలచనివానికి సమ్మతి. "శృతి॥ ద్వైతం సంసారమిత్యాహు రద్వైతం పరమార్థతః॥" అను ప్రమాణమునకు విరోధముగను అద్వైతసిద్ధిగలుగక ద్వైతమే ప్రాప్తించును. కాబట్టి "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" యను శృత్యర్థమునెరిగి చిద్రూపిణియగు ప్రకృతియును అస్మచ్ఛబ్దవాచ్యుడైన సద్రూప పరబ్రహ్మమును ఒక్కటేయనియును, ఆ పరబ్రహ్మమే తానని తలచి అష్టవిధానందములలో శ్రేష్ఠమైన ముఖ్యానందమును పొందు వాడే ముఖ్యుడని వేదాంతసిద్ధాంతము.

# దశవిధప్రళయములు

## ౧ వృత్తి ప్రళయము

ప్రాణుల పుణ్యపాప మిశ్రకర్మఫలప్రాప్తి పరబ్రహ్మ స్వరూపమైన వికార చిదాకాశమందు అణగియుండి, జీవులకు అదృష్టానుసారముగ కాలకర్మానుగుణ్యముచేత సముద్రమున అలలు బుగ్గలు తుంపురులు పుట్టుచు అణగుచూ యుండునట్లు చిదాకాశమున కాలానుగుణ్యప్రాప్తముగ వృత్తులు పుట్టుచూ గిట్టుచూయుండును. ఆపుట్టిగిట్టేదిలేక ఏమీ లేని వట్టిబట్టబయలే వృత్తిప్రళయము.

## ౨ అవస్థా ప్రళయము.

ఆవృత్తియే బలసి అనేకవ్యవహారములు చేయుటకు జీవుల కాలకర్మవశముల జాగ్రత్ స్వప్నావస్థలుగల స్థూల సూక్ష్మ శరీరములను పొంది వెలుపలికివచ్చి వ్యాపించుచూ లోపించుచూ ఉండును. ఆలోపించిన యెడమే నిద్ర. ఆనిద్రయే నిత్యప్రళయము.

## 3 శరీర ప్రళయము.

పిమ్మట ఆవృత్తులే ప్రబలి జాగ్రదాద్యవస్థలతో గూడి నిమేషము, కాష్ఠ, కలా, క్షణము ముహూర్తము, అహోరాత్రము అనునవి గలిగినదినము. అట్టిదినము పక్షము, మాసము, ఋతువు, అయనము అనువానితో గూడినది సంవత్సరము. అట్టి సంవత్సరములమితి ప్రకారము జీవించి మృతినొందుటే శరీరప్రళయము.

## ౪ మనుప్రళయము.

శుక్లకృష్ణపక్షములే అహోరాత్రములుగాగల పితృదేవతల యొక్క ఒకదినము; మనుష్యులకు ఒకమాసము. అట్టి మాసములు పండ్రెండయ్యేనేని మనుష్యులకు ఒకసంవత్సరము, అధిదేవతలకు ఒకదినమగును. అట్టిదినములు మున్నూటరువది యయ్యేనేని దేవతలకు సంవత్సరమగును. అవి పండ్రెండు వేలు గడచెనేని 1728 వేల సంవత్సరములుగల కృతయుగమగును. 1296 వేల సంవత్సరములు గల త్రేతాయుగంబును 864 వేల సంవత్సరములుగల ద్వాపరయుగంబును 432 వేల సంవత్సరములుగల కలియుగంబును గడచును. ఆనాలుగు యుగములును గూడినదే ఒకమహాయుగము. అవి 71 అయ్యేనేని ఒక మనువు చచ్చును. ఇదే మనుప్రళయము.

## ౫ బ్రహ్మప్రళయము

అట్టి మన్వంతరములు పదునాలుగు గడచెనేని చతుర్ముఖబ్రహ్మకు ఒక పగలగును. ఆపగటిలో స్వాయంభువ స్వారోచిష ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సూర్యసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, భద్రసావర్ణి, దేవసావర్ణి ఇంద్రసావర్ణి, అనెడి పదునాల్గు మనువులును లయింతురు. ఇక నంతకాలము గడచెనేని, బ్రహ్మకు రాత్రి యగును. ఇందులో పగలు ఉదయకల్పమనిన్ని, రాత్రి క్షయకల్పమనిన్ని చెప్పబడును. ఇట్టి దినములు 360 అయ్యేనేని

బ్రహ్మకు ఒకసంవత్సరమగును. అట్టి సంవత్సరములు నూరు గడచెనేని బ్రహ్మప్రళయమగును.

౬ విష్ణుప్రళయము

బ్రహ్మజీవితకాలము విష్ణువునకు ఒకమాసము. అట్టి మాసములు పండ్రెండుకూడినది ఒకసంవత్సరము. అట్టిసంవత్సరములు నూరుగడచెనేని విష్ణువు మరణించును. విష్ణువు ప్రళయములోపల బ్రహ్మ లనేకు లగుదురు.

౭ రుద్రప్రళయము

విష్ణువుయొక్క జీవితకాలము రుద్రమూర్తికి ఒకదినమగును అట్టిదినములు 360 కూడినది ఒకసంవత్సరము. అట్టిసంవత్సరములు నూరైన రుద్రుడు మృతినొందును. ఆరుద్రుని జీవితకాలములోపల అనేకవిష్ణువులు పుట్టి గిట్టుదురు. ఇదే రుద్రప్రళయము.

౮ మహేశ్వర ప్రళయము

రుద్రమూర్తి ఆయుష్యమంతయు మహేశ్వరునకు ఒక ఝాము. అట్టిఝాములు యెనిమిదిగలది ఒకదినము. అట్టి 30 దినములు ఒకనెల, అట్టి 12 నెలలు ఒకసంవత్సరము, అట్టి సంవత్సరములునూరైన మహేశ్వరుడు లయించును. ఆమహేశ్వరుని జీవితకాలములోపల రుద్రులనేకులు పుట్టిగిట్టుదురు.

౯ సదాశివప్రళయము

మహేశ్వరుని ఆయుష్యమంతయు సదాశివునకు రెండు గడియలు. దీనినే ముహూర్తమందురు. అట్టి ముహూర్తములు

30 ఒకదినము. అట్టిదినములు 360 గలది ఒక సంవత్సరము. అట్టి సంవత్సరములు నూరయ్యేనేని సదాశివుడు లయించును. ఆతని ఆయుస్సులోగా అనేక మహేశ్వరులు పుట్టి గిట్టుదురు. ఇదే సదాశివప్రళయము.

౧౦ విరాట్పురుష ప్రళయము

సదాశివుని ఆయువంతయు విరాట్పురుషునకు ఒకక్షణమగును. అట్టి క్షణములు 360 ఒకదినము. అట్టి దినములు 360 గలది ఒక సంవత్సరము. అట్టి సంవత్సరములు నూరయ్యేనేని మాయా ప్రతిబింబేశ్వరుడైన విరాట్పురుషుడును లయించును. అతని జీవితకాలములోపల అనేక సదాశివులు ఉదయించి లయింతురు. ఇదే విరాట్పురుషప్రళయము.

ఇట్టి ప్రళయములు చిదచిత్స్వరూపిణియగు మూలప్రకృతియందు కలుగుచూ మునుగుచూ యుండును. బ్రహ్మనిష్ఠగల మహాపురుషుడు ప్రకృతిని లయింపజేసి పరబ్రహ్మమై వెలుగును.

## బ్రహ్మతత్త్వ వివేకము

"శృతి॥సదేవ సోమ్యేద మగ్రఆసీత్,ఏకమేవా ద్వితీయం బ్రహ్మ॥" తా. ప్రపంచసృష్టికి పూర్వమున్నూ, వర్తమానకాలమందున్న తల్లయమునకు పరమందున్నూ, అధిష్ఠానమగు వస్తువు బ్రహ్మము. బ్రహ్మమునకు లక్షణమేమనగా? "శృతి॥ యతోవా యిమాని భూతాని, జాయంతేత్యాదిశృతేః" తా. దేనివల్ల యీజగము పుట్టి పెరిగి గిట్టెనో, అట్టిది బ్రహ్మమని

తటస్థలక్షణము. "శృతి॥ సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ, ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్ రసోవైసం" తా॥ సత్ యనగా త్రైకాలికాబాధ్యత్వము. చిత్ యనగా జ్ఞానము. ఆనందమనగా ఇతరానభిభూత సుఖానందము. కాబట్టి సార్వకాలస్థితియు, జ్ఞానము, ఆనందము-యీమూడు బ్రహ్మమునకు స్వరూప లక్షణములు "శృతి॥ అహారస్వమణు స్వమదీర్ఘం, నిర్వికల్పో నిరాకారో నిర్గుణో నిష్క్రియో నిరంజనో నిరాఖ్యాత శుద్ధో బుద్ధః" తా॥ అట్టి బ్రహ్మము నిరాకార, నిర్వికార, నిర్గుణ నిష్క్రియ, నిరంజన, నిరాఖ్యాతంబై స్వజాతీయ విజాతీయ స్వగత భేదరహితంబై, సర్వపరిపూర్ణంబై యఖండంబై యుండును.

## ముక్తి వివేకము

"శృతి॥ తద్విజ్ఞానార్థం సద్గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణి శ్రోత్రేంద్రియ బ్రహ్మనిష్టం బ్రహ్మవిత్ బ్రహ్మైవాహ భవతి బ్రహ్మది దాప్నోతి పరం తస్యతావదేవచిరం యావన్నవిమోక్షతే అధ సంప్స్యతే." తా॥ అట్టిజీవుండు అనేక జన్మంబులజేయు సత్కర్మంబువలన, తనను తాను తెలుసుకోదలచును. తలచి కారణగురువు నాశ్రయించవలయును. ఆయనవల్ల మహావాక్యార్థంబు అనుభవంబు జేసికొని బంధముక్తుండగును - అది యెట్లంటే "తత్వమసి" యను ఈ మహావాక్యార్థంబును గురువు శిష్యునికి ఉపదేశించుచున్నాడు. ఏమనగా - నీవు ఆ బ్రహ్మము అయితివి. ఇది

ఉపదేశము" ఇందుమీఁద శిష్యుడు గురువును ప్రశ్నింపవలెను. ఏమనగా, నేను కించజ్ఞుడను, జడుడను, అజ్ఞానిని అయిన నేను సర్వజ్ఞుడు స్వయంప్రకాశ మానుండగు ఈశ్వరుండను నే నెట్లగుదును ? ఇది విరుద్ధము. భృత్యుడు ఏవిధముగా రాజగును! అని శిష్యుడడిగితే గురువు చెప్పుచున్నాడు. ఏమనగా ఈ మహా వాక్యార్థమునకు, నీవు చెప్పినమాట బాధకమైయున్నది. సత్యము. ఇందుకు పరిహారము చెప్పుచున్నాను వినుము. "లోక ములో పద్యాదులందు ముఖ్యార్థమునకు బాధగలిగితే లక్షణా వృత్తిని ఆశ్రయించుచున్నారు. ఆ లక్షణావృత్తి యనగా బాధితమైన ముఖ్యార్థమునకు సంబంధించి వేరొక యర్థమును చెప్పుచున్నారు. కాబట్టి ఈ వాక్యమందున్నూ, కించిజ్ఞుడైన జీవుండు సర్వజ్ఞుండగు ఈశ్వరుడేలాగు అగునని శంకవచ్చినందున లక్షణావృత్తిని ఆశ్రయించి వేరేయర్థమును జెప్పవలెను. అది యెట్లంటే ఇచ్చట జహాద, జహార్లక్షణయనగా భాగత్యాగ లక్షణము. తత్పదవాచ్యుండైన ఈశ్వరునియందు సర్వజ్ఞత్వాది ధర్మములనున్నూ, భాగత్యాగము చేసినమీఁదట నీయందున్న కించిజ్ఞత్వాది ధర్మములు భాగత్యాగము చేసినమీఁదట సచ్చి దానందాత్మకమైన కేవల శుద్ధచైతన్య బ్రహ్మము శేషించి నది- ఆ రెండును ఒకటిగాను జీవుడవైన నీవు ఈశ్వరుండవైన నీవు బ్రహ్మమైనావు. ఇదిసత్యము ఇందుకు నీ ఆత్మానుభవమే సాక్షి అని గురువు చెప్పినమీఁదట ఆత్మానుభవప్రమాణము చేత "బ్రహ్మైవాహమనిన్నీ" "అహంబ్రహ్మాస్మి" యనిన్నీ అఖండాకారవృత్తి గల్గును.

తరువాత నిర్వికల్పసమాధియందు నిధిధ్యాసయున్నూ, స్థిరలక్ష్యసిద్ధియున్నూ యవును. "శృతి॥ సర్వం ఖల్విదం బ్రహ్మ నేహనా నాస్తికించనా సర్వం సమాప్నోతి తతోసి సర్వః." తా॥ అట్టివానికి సర్వము బ్రహ్మంబై తోచును. ఎద్ది గనిన యదే బ్రహ్మంబగును. ఇక్కడ ఒక శంకగలదు. ఏమనగా - నామరూపాత్మకంబైన సర్వప్రపంచము బ్రహ్మంబైతే, దృశ్యమైన సర్వము నశించునుగనుక బ్రహ్మము నశించునని చెప్పవలసి వచ్చెను. ఇందుకు సమాధానము చెప్పు చున్నాము వినుము. ఈ దృశ్యమైన ప్రపంచము, సత్తు, చిత్తు, ఆనందము, రూపము, నామము, యను అయిదు యంశ ములై యున్నవి.

"శృతి॥ యథానద్యస్స్యందమానసముద్రాంత్తంగచ్ఛంతో, నామరూపై ర్విహాయ తథైవ విద్వాన్ పుణ్యాపాపై ర్విహాయ తం గచ్ఛంతో పరమం శాశ్వితముపైతి." తా॥ నదులున్నూ నద్యం తరములైన యితరప్రవాహములున్నూ, మహోదధిలో కలసి నప్పుడు నామరూపములు విడచి మహోదధి అయినట్లుగానే "తథైవ విద్వాం పుణ్యాపాపైర్విహాయ" ఆలాగుననే విద్వాంసుడు పుణ్యాపాపములను విడచి శాశ్వితమైన బ్రహ్మపదమును జేరు తూయున్నాడు. ఇది శ్రీ గురురాయునిద్వారా దెలిసికొనక తెలియబడదు గాన తెలిసికొని ముక్తులు గావలెనని కోరుతూ యున్నాను.

## మహావాక్యములు

శ్లో॥ అహం నాన్యో మహానాన్యో మదర్థోమాం వినాకలిః।
ఉక్త్వానుక్త్వా ద్వయోనాస్తి అభయస్థం గురుః పదః॥

ఋగ్వేదవాక్యం = ప్రజ్ఞానం బ్రహ్మ
యజుర్వేదవాక్యం = అహం బ్రహ్మాస్మి
సామవేదవాక్యం = తత్త్వమసి
అథర్వణవేదవాక్యం = అయమాత్మాబ్రహ్మ

ఇవి మంత్రరూపంగా ఉచ్చరించే విధము.

'ప్రజ్ఞానం బ్రహ్మ' 'అహంబ్రహ్మాస్మి' 'తత్త్వమసి' 'అయమాత్మాబ్రహ్మ' 'సత్యంజ్ఞానమనంతమానందంబ్రహ్మ' 'ఏకమేవాద్వితీయంబ్రహ్మ' 'సర్వంఖల్విదంబ్రహ్మ' 'నేహానానాస్తికించనా.' యీమంత్రము త్రికాలములయందును స్మరించవలసినది. ఇందువలన పాపములేదు, పుణ్యములేదు, దుఃఖములేదు, జన్మములేదు, జగములేదు, 'షడూర్మిరహితం' శివం యిందుకు అర్థము. 'ప్రజ్ఞానం బ్రహ్మ' ప్ర, అనగా = పరాఅనే ప్రకృతిపేరు. ప్రకృతియనగా = మాయ, యీమాయయే అహంకారము; ఈ అహంకారమే తెలివి. యీ తెలివే సమస్తప్రపంచము-సత్యమని తోచుభ్రమ. జ్ఞానమనగా అంతర్బాహ్యముల వాఙ్మనోగోచరమైనది. "యద్దృశ్యం తన్నశ్యం, యత్కృతం త దనిత్య"మ్మనే న్యాయమునుబట్టి ఈకనుపించే వాక్కున చెప్పబడే సర్వమున్నూ అనాత్మయనిన్ని, అజ్ఞాన

మనిన్ని, విడిచి ఒక్క గురువాక్యమందు ఏకచిత్తమున నిలిచి నదే జ్ఞానమనిన్ని, ఆత్మయనిన్ని, ఆత్మానాత్మల రెంటిని తెలిసికొన్న తానే బ్రహ్మమని ఋగ్వేదవాక్యం. కాబట్టి సమస్త జగత్తు బ్రహ్మభావన జేసినది గురుదీక్ష.

## అహం బ్రహ్మాస్మి

అనగా: అకార, ఉకార, మకారములు కూడిన దే ప్రణవము. ప్రమాణం:- 'శ్రుతి. త్రిధాబద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ. అకారం, బ్రహ్మమనిన్ని, ఉకారం విష్ణువనిన్ని, మకారం ఈశ్వరుడనిన్ని, మూడుకూడి నదే ప్రణవమనిన్ని, కూర్చేవిధము అకారం రాజసగుణము, అదిశబ్దరూపముగానుండును. ఉకారం, సాత్వికగుణము అది సంకల్పరూపముగా నుండును. మకారం తామసగుణము, అది దృగ్రూపముగానుండును. చూపు, పలుకు, మనస్సు. ఈ మూడు సద్గురువు చెప్పినస్థానమందు ఐక్యం చేసినదే ప్రణవము. అకారమైన అర్ధమాత్రక ఆధారచక్రమునబుట్టి పరాపశ్యంతి మధ్యమ వైఖర్యాది చతుర్విధ శబ్దంబులనుదాటి 'హం' యని సుషుమ్నను యెక్కి తనస్థానమందు ఐక్యమవును. కాబట్టి "అహం బ్రహ్మాస్మి" అని యజుర్వేద వాక్యము. అనగా గీర్వాణ భాషచేత నేననేమాట-నేననగా పరబ్రహ్మరూపమనిన్ని, యిదే ఈశ్వరుడనిన్ని విశ్వమంతా భరించినందుచేత యీశ్వరుడనిన్ని మంగళప్రదమైన తెలివిని యిచ్చుటచేత శివుడనిన్ని ఆయొక్క తెలివే నేత్రమధ్యమందు వున్నదనిన్ని 'శృతి. విశ్వం చక్షురు

తం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితః” అని ప్రమాణము పలుకుచు న్నది. గనుక తననేత్రమందు కనుపించే సర్వచరాచర ప్రపంచ మున్నూ యీశ్వరుడని గురువు చెప్పిన అద్వితీయ దీక్షను భావించినదే యజుర్వేదార్థము. అట్టిఅభ్యాసమైతే తానే బ్రహ్మమని 'అహంబ్రహ్మాస్మి' యని పలుకుట.

## తత్వమసి

తత్వమసీత్యభేదవాచకం. “శ్లో॥ యే జపంతి తే శివసాయుజ్యము క్తి భాజాభవంతి.'' అని ప్రమాణమున్నదిగనుక గురువు యందు క్రియాద్వైతం, ప్రపంచముయందు ద్రవ్యాద్వైతం, ఆత్మయందు భావాద్వైతం కలిగినదే అభేదవాచకం. ఇదే జపంచేయతగ్గది. తత్వమసి. తత్ అనగా నిరాకార స్వరూపం. త్వం అనగా హంసస్వరూపం. అసి యనగా నిరాకారస్వరూపమునందు కలియుట. ఈప్రకారముగా సమ స్తజగత్తు ఐక్యమగుతూ యున్నట్టు తెలిసి, భ్రమవదలుటే జీవేశ్వరులకు ఐక్యానుసంధానము. జీవుడనగా ప్రపంచము. సత్యమనేభ్రమ, ఈశ్వరుడనగా సర్వప్రపంచము; అనాత్మయ నిన్నీ, ఏకత్వసిద్ధిగలిగినదే ఈశ్వరత్వము. కాబట్టి సర్వప్రపం చమున్నూ నిరాకారమేనని జ్ఞానము కలిగితే అభేదజ్ఞానము. అభేదమే జ్ఞానమనిన్నీ, భేదమే అజ్ఞానమనిన్నీ, సమస్తశాస్త్ర ములయందు చెప్పబడ్డది కాబట్టి జీవేశ్వరులకు వ్యష్టి, సమిష్టిగా శాస్త్రములు చెప్పుటేకాని ఐక్యమయ్యే పరిణమించును.

# అయ మాత్మా బ్రహ్మ

అయంశబ్దానకు : ఒక్కపిండమందే తాత్పర్యముగనుక అండపిండ బ్రహ్మాండములకు భేదములేదని అభేద నిష్కర్షగా ఈ వాక్యం పలుకును. అండమంటే గ్రుడ్డు, పిండమంటే సమస్త దేహములయందు కారణమైయున్న హంసస్వరూపము. బ్రహ్మాండమంటే పదునాలుగు భువనంబులు తన కుక్షిని యిముడ్చుకొని తాను విలక్షణమైయున్న పరమాత్మ. ఈమూడింటికిన్ని ఏకత్వసిద్ధి యేలాగంటే బ్రహ్మాండంవలన పిండాండం, పిండాడంవలన అండాండం, అండాండంవలన బ్రహ్మాండం, బ్రహ్మాండంవలన అనంతకోటిబ్రహ్మాండం, అనంతకోటిబ్రహ్మాండంవలన అండాండం, అండాండంవలన సమస్త జగదుద్భవం, సమస్త జగం అండంలోను- అండము పిండములోను- పిండం బ్రహ్మాండమునందు ఐక్యమవుతూయున్నది. కనుక యీ ప్రకారం యీ నాలుగు మహావాక్యముల అర్థము తెలుసుకున్నవారే పాపపుణ్యములు, జనన మరణములులేక బ్రహ్మస్వరూపమే తానని సమస్తవేదాంత సిద్ధాంతము. ఇది నమ్మినవారలకు మోక్షం. ఇదితప్పదు. ఇదే గురువాక్యము. దీని యనుభవమును సద్గురువులచే గ్రహించిన సిద్ధికరము.

ఉపరి చతురు వాక్యములలో "సత్యజ్ఞాన మనంత మానందం బ్రహ్మ" అనగా జనన మరణాద్యవస్థలులేక, 'కలదు లేదు' అనే సందేహములులేక కదలక ఖర్చుపడక యేపరమాత్మ స్వరూపండున్నదో అదే సత్యమనే అర్థం. జ్ఞానమనగా

ఆయొక్క సత్యస్వరూపమే మాయామంత్రరూపముగా తోచి దేహేంద్రియములను గుణాద్యవస్థలుగల జగత్తును తన సహాయంచేత సమస్తవ్యవహారములు తెలుసుకున్నందున జ్ఞానమనిన్నీ, అనంతమనగా ఆదిమధ్యాంతములులేక యింతని ప్రమాణములేనందున అనంతమనిన్నీ, తన గర్భమందు సృష్టి అవుతూయున్న జీవకోట్లకు యింతయనిచెప్ప శక్యముకానందున అనంతమనిన్నీ, ఇట్టి అర్థమును గురువాక్యం ద్వారా తెలుసుకున్నందున ఆనందముగా యుంటున్నది. "ఏకమేవా ఉద్వితీయం బ్రహ్మ" అనగా ఏక=ఒక్కడైన యేపరమాత్మ స్వరూపముగలదో అతనిగర్భమందు పదునాల్గుభువనములున్నూ, యెనుబదినాల్గులక్షల జీవులున్నూ, తొంబదియారు తత్వములున్నూ, యిన్నింటికి జీవుడు ఒక్కడైనందున ఒక్కటేనని తెలుసుకున్న జ్ఞానమే బ్రహ్మత్వమని పలుకుట. సర్వంఖల్విదంబ్రహ్మ అనగా, సర్వశబ్దమునకు తాత్పర్యం అంతర్బాహ్యములనేమాట. అంతర్బాహ్యములనగా తన దేహము మొదలుగా సమస్తప్రపంచము నిరాకార, నిరామయ, నిరంజన, నిర్వికల్ప, నిష్క్రియ, అని ర్దేశ్యమైన పరబ్రహ్మమేననుట. "సర్వంఖల్విదం బ్రహ్మ" ఇందుకుప్రమాణము. "శ్లో॥ అనాత్మదృష్టి రవివేకనిద్రామహం మమస్వప్నగతం గతోఽహం." అని సమస్తవేదాంత శాస్త్రములయందున్నూ, చెప్పబడుతూ యున్నది. నేనుఅనిన్నీ నీవు అనిన్నీ, నాది అనిన్నీ, నీది అనిన్నీ, ఉన్నది లేదు అనే

సంశయములులేక యెట్టివిధమైన భయములను విడచిపెట్టినదే అభయమనుట. ఈ అభయమువలన 'షడూర్మిరహితం శివం' అనే భావముచేత, సద్గురుపాదారవిందమే భక్తిక్రియావిజ్ఞానములకు అభయమైన జీవన్ముక్తి కలుగజేయును. ఇదే విదేహముక్తి. నిత్యముక్తి. సంకల్పరహిత వికల్పనారహితమైన కైవల్యం అని ప్రమాణం. ఆశయే వైతరణీయనిన్నీ, కామమే నరకమనిన్నీ, క్రోధమే యముడనిన్నీ, వీటిని విడచిన వైరాగ్యమే భోగ్యమనిన్నీ, ఆత్మజ్ఞానమే సుఖమనిన్నీ, సంతోషమే ఆనందమనిన్నీ, శాంతమే కామధేనువనిన్నీ, మౌనమే కల్పవృక్షమనిన్నీ, పరమహంసే దైవమనిన్నీ, భావించి గుణవర్జితులై, సత్పురుష సేవాజీవితులై ఆత్మారామపూజాపరులై, మౌనజీవాధీనులై, అచింతితజ్ఞాననిష్ఠులై, అనిత్యసుఖవర్జితరసికులై సుజ్ఞానవస్తుజన సేవకపరిపూర్ణులై, జగత్తనేపట్టణమందు సుబుద్ధిసారథ్యశరీరరథారూఢులై, ప్రజ్ఞానాంగనా సేవితులై, నిత్యజ్ఞానసంతుష్టులై, ధనికులదీనవార్తలు చెవులవినక, కర్మలకాయకష్టాలు కన్నులచూడక, మనసేంద్రియారామమార్గమున చనక, భవిష్యత్కార్యములకు చింతిల్లక, వర్తమాన కార్యములకు సంకోచింపక, వర్తించినవారే, జగద్వంచక జ్ఞానులు. యథేచ్ఛాసంచార శీలురై, ధీరులై కలిగెనన్న సంతోషమును, లేకపోయెనని విచారమున్నూ లేక, జగద్రూప నామ భేదములను విడచి, చావునుగూర్చి భయమున్నూ, బ్రతికియున్నాననే భావమునువిడచి, ప్రాప్యాశేషపురుషార్థులై, సమ

యోచిత ఫలప్రాప్తులై, ఆత్మజ్ఞాననిష్ఠులై, అసంగృహీతచిత్తులై, విధి, నిషేధభావనలేక వర్తించినవారే జీవన్ముక్తులు; వారే పరమాత్మజ్ఞాననిష్ఠులు.

## జ్ఞానాష్టాంగములు.

1. యమమనగా దేహము నేనుకానని భావించుటయే. 2. నియమమనగా పరతత్వ విచారణయందు సర్వకాల సర్వావస్థలయందును అనురక్తుండగుటయే. 3. ఆసనమనగా త్రిభువనాంతర సర్వజంతురాసులయందున్నూ, వున్న ఆత్మయే తానని తెలిసికొని తటస్థవృత్తిచే నుండుటయే. 4. ప్రాణాయామమనగా ఈ సమస్తజగత్తు మిథ్యయని దృఢముగా భావించుటయే. ౬. ప్రత్యాహారమనగా చిత్తము లోకవ్యవహారమునుండి త్రిప్పి అంతర్ముఖవ్యాప్తి నొందించుటయే. 6. ధారణయనగా చిత్తమును సమస్తవృత్తిరాహిత్యమగునట్లు పరిశుద్ధముచేసి మరల చలించనియ్యకుండుటయే. 7. ధ్యానమనగా గాలి లేనిచోట దీపము యెటుల నిలచునో అట్లు నిర్మలత్వమును అవలంబించి పరబ్రహ్మావలోకనము జేయుటయే. 8. సమాధి యనగా ఇట్లు క్రిమ క్రిమంబున నివృత్తి జ్ఞానంబున బ్రవేశించి ధ్యానించిన సచ్చిదానందలక్షణముగల ప్రత్యగాత్మయే తత్పదలక్ష్యార్థమగు బ్రహ్మమన్న సచ్చిదానందమే గావున ఈ ప్రత్యగాత్మకు పరమాత్మకు కొంచెమైనను భేదములేదని గుర్తెరుంగుటయే సమాధి యనంబడును.

## ముక్తాత్ముల వివరము.

బ్రహ్మవిదు, బ్రహ్మవిద్వరు, బ్రహ్మవిద్వర్య, బ్రహ్మవిద్వరిష్టులని, నాలుగు తెరంగులవారు.

1. బ్రహ్మవిదుని లక్షణము: శరీరేంద్రియములందు అభిమానము, తానుచేయునట్టి వ్రతములు దానములు మొదలగువానియందలి ఫలమును, పుత్రమిత్ర గృహాదులయందు ఆసక్తియును లేక, అహంకారమును విడిచి, సదా ప్రత్యగాత్మ యగు తనయందే పరమాత్మ యున్నట్లు నిశ్చయించి సుఖముగానుండువాడే బ్రహ్మవిదుండనబడును.

2. బ్రహ్మవిద్వరుని లక్షణము : సకలమైన కర్మములు వ్రతములు దానములు మొదలగువానిని విడచి, సుఖదుఃఖములను సమముగానెంచి, సమస్తమైన కష్టములను విచారించక విషయచాంచల్యమునకు లోబడక, అన్నిటిని సమానముగా భావించుచు నిశ్చలచిత్తుడై యుండువాడే బ్రహ్మవిద్వరుడనబడును.

3. బ్రహ్మవిద్వరీయుని లక్షణము : పరమాత్మతో నైక్యమగు భావముతప్ప, తదితరమునందు జ్ఞాపకములేక, మితాహారియై శరీరమును మరచియుండువాడే బ్రహ్మవిద్వరీయుడనబడును.

4. బ్రహ్మవిద్వరిష్టుని లక్షణము : అంతరబాహ్య

వ్యాపారముల నంతయు మరచి, ఏ వృత్తియునులేక, పరమాత్మయే తాననియు, తానే ఆపరమాత్మయనియు భావించి, ప్రకాశించువాడే బ్రహ్మవిద్వరిష్ఠుడనబడును. ఈ నలుగురిలో మొదటివారు యిద్దరున్నూ, సంచితముచే గలిగిన అనుభవమును అసత్యమని తలంతురు. మూడవవానికి ప్రారబ్ధము లభించినను లేకయుండును. నాల్గవవానికి: ప్రారబ్ధము కొంచెమైనను లేకయుండును. అయితే నలుగురికి భేదముండినను, ముక్తియందు భేదములేదని తెలియతగినది.

## త్రివిధదీక్షా, త్రివిధప్రసాద, త్రివిధలక్ష్యముల వివరం.

సీ॥ సద్గురు పాదకంజాతముల్ సేవించి
వారిచే నుపదేశవర్తియగుచు
త్రివిధదీక్షలబొంది భవములన్నియుగుంది
త్రివిధలక్ష్యార్థముల్ తెలియజూచి
త్రివిధవర్ణంబుల వివిధమంతయుగని
త్రివిధక్రియల మదిద్రిప్పనీక
త్రివిధప్రసాదముల్ స్థిరమతిభుజియించి
త్రివిధసూత్రాచారమవిరళముగ
తెలియకున్నను యద్వైతదివ్యసుఖము
గలుగనేరదు నిత్యాత్మగనగరాదు యనుచు
దెలిపిన గురుగుణమెంచి ధిక్కరించునట్టి
నరునకువచ్చు హేతువును వినుము.

తా॥ సద్గురుపాదకంజాతముల్ సేవించి, అనగా, సద్గురు పరమాత్మస్వరూపము; పాదములు అనగా సర్వప్రపంచ మునకును ఆధారమైన కారణమునే పేరుగలిగి నడిపించుచూ యున్న బ్రహ్మశబ్దమైన “హం, సః” అనే రెండక్షరములే పర మాత్మయొక్క పాదములు. ఆపాదములు నడిచేమార్గమున యున్న కంజాతములు అనగా ఆధార, స్వాధిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆగ్నేయ, షడాధారములనే ఆరుచక్ర ములు సేవించడమనగా; యీచక్రములమీదుగా నడుస్తూ యున్నహంసతో మనస్సుచేర్చి వుంచడమే సేవించడము.

వారి ఉపదేశమనగా; మనోపవనములు రెండూ ఒక్క టిగాయై ఉపరిదేశమైన పరమాత్మను కలిసి వర్తించడమనే తెలి వికి ఉపదేశమనిపేరు. అన్నమయాది పంచకోశములున్నూ, ప్రాణాది పంచవాయువులున్నూ, శ్రోత్రాది జ్ఞానేంద్రియము లున్నూ, అంతఃకరణచతుష్టయమున్నూ, తాగాక వర్తించ డమే ఉపదేశవర్తనము.

‘త్రివిధదీక్షలబొంది భవములన్నియు గుండి’ అనగా, శబ్దము, దృష్టి, సంకల్పములుగనుక శబ్దములలోయుండే అర్ధ భేదములను విడచి సర్వశబ్దములు ప్రణవముగా భావించడము ఒకదీక్ష. దృగ్గోచరమైన రూపభేదములను విడచి సర్వాత్మనిగా భావించడము ఒకదీక్ష. సంకల్పమునప్పుట్టే సర్వకోర్కెలను విడచి ప్రణవనాదముయందే మనస్సునిలుపుట ఒకదీక్ష. యీ

మూడుదీక్షలవలన భవ, పుట్టడమనేటటువంటి పాపమునశించి శాశ్వితమై యుంటుందని చెప్పుట.

'త్రివిధలక్ష్యార్థముల్ తెలియజూచి' అనగా: అంతర్లక్ష్య, మధ్యలక్ష్య బాహ్యాలక్ష్యములని గలవు. ఈ మూడింటిని సాకారలక్ష్యమునవిడచి, నిరాకారభావమున చెప్పేది యేమంటే, అంతర్లక్ష్యమనగా నేననేటటువంటి తెలివిశూన్యమనిన్ని శూన్యమైన నావలనగలిగేటటువంటి సర్వవ్యాపారము శూన్యమనిన్నితోచేది. మధ్యలక్ష్యమనగా, అనృత దుఃఖాత్మకమైన నా దేహ ప్రాణము మొదలుగా సర్వప్రపంచము మాయయనిన్ని, లేనిదనిన్ని యేమీ తెలియదనిన్ని సర్వవేదాంతశాస్త్రములు నిశ్చయించినందున యీ దేహప్రాణములు నేను కాననేదే మధ్యలక్ష్యము. బాహ్యాలక్ష్యం అనగా 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అనే ప్రమాణముచొప్పున స్థావరజంగమాది సర్వప్రపంచమున్నూ ఒక్కకుక్షియందే యిమిడి నొక్కటైయై యున్నందున ఒక్కడేనని చూడబడినదే బాహ్యాలక్ష్యం.

"త్రివిధవర్ణంబుల వివిధమంతయుగని, అనగా మూడు అక్షరములు అవి ఏవియనగా: అకార, ఉకార, మకారములు. ఇవే తామస రాజస సాత్వికములు. ఇవే నాదు బిందుకళలు. నాదమనగా శబ్దము. బిందువనగా భ్రమ. కళ అనగా చూపు. వీటిలోయున్న అనేకవిధములైన నామరూప కోరికలనువిడచి "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే శృతి ప్రమా

ణమునుబట్టి సర్వం మనఃకల్పితమనియెంచి మనస్సు మాయగా యెంచి, నాదుబిందుకళాతీతుడైన ఆత్మను ఒక్కడుగా భావించి నదే త్రివిధవర్ణముల స్వరూపము: త్రివిధక్రియల మది దిరుగనీక అనగా చేసేవ్యవహారములకు వేరువ్యవహారములు యేవియనగా: కన్నులతో చూచి చేసేదిన్నీ, చెవులతో వినేదిన్నీ, మనస్సున సంకల్పించేదిన్నీ, ఈమూడింటిచేతనున్నూ మాయారూపమైన ఈజగత్తు సత్యమని తోస్తూయున్నది. శ్లో॥ సత్యం జనవిరోధాయ అసత్యం జనరంజకం॥ అని వున్నదిగను కసత్యమైన ఆత్మయనగా దృక్ శబ్దం. సంకల్పముచేత నిర్వికల్పశుద్ధం. ఏకోనారాయణః॥ అని శృతి ప్రమాణముగనుక ముట్టిన వస్తువునున్నూ, మూర్కొన్న వస్తువునున్నూ, విన్న శబ్దవస్తువునున్నూ, పలికే పలుకున్నూ, పరమాత్మనిగా భావించడమే క్రియలతో మనస్సు తిరుగకుండాబట్టుట. 'ముట్టిన చూచిన మూర్కొన్న విన్నను పలికిన బ్రహ్మమై బరగవలయు.'

'త్రివిధ ప్రసాదముల్ స్థిరమతి భుజియించి' అనగా: "గురుపాదోదకం పీత్వా గురోరుచ్ఛిష్ట భోజనం గురుమూర్తిం సదాధ్యాయే గురుమంత్రం సదాజపేత్" గురుపాదోదకం పీత్వా యనగా: గురువాచకం శ్రేష్ఠవాచకం. 'గురోరధికం నగురోరధికం.' నగురో అన్నారుగనుక గురువు సర్వప్రపంచాతీతుడైన పరమాత్మ. ఆ పరమాత్మకు పాదములు అనగా విపరీతార్థబోధ. ఈ సర్వప్రపంచమును యే ఆధారముచేత

నడుస్తూయున్నదో అట్టిపాదాక్షరములకు "ఏకాక్షరం ద్వ్యక్షరం హ్యే షడక్షరమథాపివా అష్టాక్షరంహ్వా మోక్షాయాం మంత్రయోగం ఫలం లభేత్." అనివున్నదిగనుక అట్టిమంత్రాక్షరములు రెండున్నూ, వానిపాదములు; జారుతూయున్న ఉదకమనగా: అకార, ఉకార, మకారములనే త్రిగుణమువలన గలిగే సర్వప్రపంచము మనస్సేనని, అట్టి మనస్సును, బహిర్గతముగానీక తానైన రెండక్షరములతో యిమిడింపజేసుకోవడమే గురుపాదోదకము పుచ్చుకోవడము. గురోరుచ్ఛిష్ట భోజనం అనగా: గురువులనగా పరమాత్ముడు గనుక "గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః॥ గురుసాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేన్నమః" అని అన్నారుగనుక, ఆపరబ్రహ్మము విడచిపెట్టినదే, సర్వప్రపంచమును ఉచ్ఛిష్టముగాయెంచి 'నేతినేతి' వాక్యముచేత అయింది కాదనడమే ఉచ్ఛిష్టభోజనం.

"గురుమూర్తి సదాధ్యాయే" అనగా పుట్టిన చూచిన మూర్కొన్న విన్నను పలికిన బ్రహ్మమై పరగవలయు అని పెద్దలవాక్యముకాబట్టి సత్తాద్వయము లేనందున సర్వముఒక్కటి యని అద్వైతసిద్ధిని కలుగజేసుకోవడమే ధ్యానముచేయుట. గురుమంత్ర జపమనగా ప్రకృతియనేమాయ. శబ్దము సోహము అనే గీర్వాణవాక్యముచేత, నీవే నేను అని పలుకుచూయున్న సాధారణమును గురుముఖముగా మరతెలసి, తిరుగతీసి, హంసనుచేసి, నాదబిందుకళలు మూడున్నూ అందునంజేర్చి

ఆకాలమందు పుట్టబడిన సునాదమును జపియించుచేటే సదా గురుమంత్రిజపం. వాసుదేవస్సర్వమితి స్సహామాత్మా, సదుర్లభః అని భగవద్వాక్య ప్రమాణము.

త్రివిధసూత్రాచార నవిరళముగా అనగా, తర్క వ్యాకరణములయందు, తర్కముయందు 96 సూత్రములున్నూ వ్యాకరణములయందు 7 సూత్రములున్నూ కలసి 103 లోను నూరింటిని వేదాంతులు పూర్వపక్షముచేసి లోకోపకారార్థముగా మూడింటిని నిల్పినారుగాన,ఆమూడున్నూ యేవియంటే, ఆగామి సంచిత ప్రారబ్ధములు - అవి యేవి యనిన సంచిత మనగా - పూర్వజన్మములయందు చేయబడిన పాపపుణ్యములు. ప్రారబ్ధమనగా - యీదేహారంభము మొదలుకొని యీరోజువరకు చేయబడ్డ పాపపుణ్యములు. ఆగామి యనగా యికముందు రాబోయ్యే కాలములయందు చేయబోయ్యే పాపపుణ్యములు. ఈ మూడింటికిని పూర్వపక్షసిద్ధాంతము ఈ ప్రపంచము కృత, త్రేత, ద్వాపార, కలియుగములని నాలుగు గలవు. ఈ నాలుగు యుగములయందు కృతయుగములో నాలుగుపాదములు ధర్మము నడిచినదనిన్నీ, త్రేతా యుగములో మూడుపాదములు నడిచినదనిన్నీ, ద్వాపరములో రెండుపాదములనిన్నీ, కలియుగమునందు మొదటి పాదమునందుమాత్రమే ఒకపాదము నడుస్తుంది అనిన్నీ, తక్కిన మూడుపాదములయందు ధర్మశూన్య మవుతుంది అనిన్నీ, చెపుతూయున్న శాస్త్రపురాణములను తెలిసినవారికి

యిది పూర్వపక్షమనే తెలుసుకోవచ్చును. ఏలాగంటే: శ్లో॥ 'ఋణపంచదశశ్శోప్చర ధర్మం శతగుణంభవేత్.' అని చెప్పుతూయున్న వాక్యమునకు నడవడి సత్యముగా యుండవలెను, కృతయుగమునందు నాలుగుపాదములు ధర్మమునడిస్తే త్రేతా యుగమునందు శతగుణము కావలసినందుకు అట్లుగాక ఒక భాగము తగ్గిపోవడమేసాక్షి. ఈప్రకారముగా యేధర్మము నకున్నూ, తరుగు కనిపిస్తూ యున్నది గాని, హెచ్చడము లేదు. కాబట్టి యీధర్మము కాదని తెలుసుకోవలసినది. యిందుకు ప్రమాణమేమంటే "అయాచితం సదోపవాస మనిన్ని" "అహింసాపరమోధర్మః" అనిన్ని, చెప్పినది ఒప్పుకున్నది గనుక ఆయాయుగములలో, ఈధర్మములు నడిచిన వని చెప్పవచ్చును. ఇంకొక్క ప్రమాణము; ధర్మార్థకామ మోక్షములు చతుర్విధ ఫలపురుషార్థములలో, ధర్మార్థకామములు మూడున్నూ పురుషార్థములనిన్ని మోక్షము పరమ పురుషార్థమనిన్ని, చెప్పుదురు.

ధర్మమనగా: సర్వప్రపంచము పరమాత్ముడని ధర్మము. అట్టిప్రపంచాతీతార్థమే పరమాత్మయనిన్ని, ఈ రెండున్నూ తెలియుకోరిక కామమనిన్ని, యీమూడు యెవరియందు నిశ్చయమో అట్టినిశ్చయమే మోక్షమనిన్ని, మోక్షమనగా: శృతి. "ఏకోనారాయణోహరిః" అనేశబ్దమునకుపైన ఒక విశేషము ఉన్నదన్నను తక్కువై యున్నదన్నను అనర్థమువచ్చును. గనుక 'శ్లో॥ నారాయణాత్పరం రూపం, తస్మిన్ నాహం కదాచన'

అని భగవద్వాక్యము 'గనుకనున్నూ, ఏక మేవాద్వితీయం బ్రహ్మ' అని శృతిప్రమాణముగనుకనున్నూ. 'శ్లో॥ ప్రారబ్ధం భోగతే నశ్యే, త్తత్వజ్ఞానేన సంచితం, ఆగామి ద్వివిధం కర్మ తద్వేషిః ప్రియావాదినః.' అని, ఆగామి సంచితప్రారబ్ధములు, మూడున్నూ నశించినట్టై వచ్చి బడును. ఇందుకు మూలంలేని గుర్తెరిగే శరీరం యేమీలేదనిన్నీ, తెలివిచేత చేయబడినటువంటి ప్రపంచమును నమ్మవద్దు అనిన్నీ యద్దృశ్యం తన్నశ్యమనిన్నీ, యత్కృతం తదనిత్యమనిన్నీ, ఈ జగత్తు అసత్యమనిన్నీ, జడమనిన్నీ, దుఃఖమనిన్నీ, చెప్పేప్రమాణము చేత వెనుకజన్మ అబద్ధమనిన్నీ ఇపుడు చేస్తూాయున్నది అబద్ధం ముందు చెయ్యబొయ్యేది అబద్ధం. ఇది ఏమంటే, ఆకాశపుష్పవత్ అనిన్నీ జలఘటచంద్రవత్ అనిన్నీ, వంధ్యా పుత్రవత్ అనిన్నీ, శశివిషాణవత్ అనిన్నీ, యివి ఏప్రకారమో అటువలెనే వెనుకజన్మమన్నందుకున్నూ, ఇపుడు జన్మమయెత్తియున్నాను అన్నందుకున్నూ ముందు యెత్తబోతానన్నందుకున్నూ యీనాల్గుప్రమాణములే దృష్టాంతములు.

"అవిరళముగ తెలియకున్నను అద్వైతదివ్యసుఖము గలుగనేరదు, నిత్యాత్మగనరాదు..." అన్నందుకు సమస్తమైన శాస్త్రములలోనున్నూ, వేదములలోనున్నూ వేదాంతములైన ఉపనిషద్వాక్యములయందున్నూ, జీవుడనగా మాయయనిన్నీ, మాయయనగా లేనిది అనిన్నీ, భేదమే అజ్ఞానమనిన్నీ, అభేదమే

జ్ఞానమనిన్నీ, చెప్పుచుండగా భేద భావమే ఛండాలత్వమనిన్నీ, అభేదకమే బ్రాహ్మణత్వమనిన్నీ, శాస్త్రములు పురాణములు, యివి వ్రాసిన పెద్దలుకూడా "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" "సర్వంఖల్విదంబ్రహ్మ" "నేహనా నాస్తికించనా" "ప్రజ్ఞానం బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" 'తత్వమసి' 'అయమాత్మాబ్రహ్మ' 'సోయం దేవదత్తః' 'గంగాయాం ఘోషః' 'మంచాః క్రోశంతి' 'జహార్లక్షణ అజహార్లక్షణ' 'జహాదజహార్లక్షణ' అనే యివి యన్నీ, అభ్యాసకాలమునందే చెప్పబడ్డవిగాని ఆరూఢమైతే యిన్నిటితో బనిలేదు. అభేద జ్ఞానముకంటె జ్ఞానమున్నూ, 'నేతినేతి' వాక్యముకంటె వాక్యమున్నూ లేదు. కనుక ఇదే అనుభవసిద్ధాంతము.

ఇంకొకదృష్టాంతము. భాగవతమన్నను, భగవద్గీతలన్నను భగవంతుయన్నను ఈ మూడింటికిన్నీ వర్ణములు ఒక్కటేగనుక ఈవర్ణములయందు చెప్పబడ్డదిన్నీ, ఈగ్రంథములలో చెప్పబడ్డదిన్నీ ఒక్కటే. ఎలాగంటే: భా, ఒకటిన్నీ గ, ఒకటిన్నీ, వ, ఒకటిన్నీ, త, ఒకటిన్నీ ఈసౌజ్ఞలు నాల్గింటికిన్నీ, భ. యనగా భక్తిన్నీ, గ. యనగా జ్ఞానమున్నూ, వ. యనగా వైరాగ్యమున్నూ త. యనగా తత్వమున్నూ, ఈనాల్గునిష్టలు గల దిక్కు భగవంతుడు అని సమస్తవేదశాస్త్రములు చెప్పినందుకు, భక్తిఅనగా: బాహ్యాభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి ఈమూడు బాహ్యాభక్తిసగుణమునువిడచి నిర్గుణముగా చెప్పేము. స్వర్గమర్త్యపాతాళములు మూడున్నూ, స్వర్గమనగా సూర్య

చంద్రనక్షత్రవాయువు మేఘవర్షములు గలిగినదే స్వర్గము. మర్త్యమనగా: చరించే జీవములున్నూ చరించనటువంటి వృక్ష పర్వతములు కలిగినదే మర్త్యము. పాతాళమనగా: సముద్రములు భూమి మొదలుగాగల అధఃప్రదేశమునందు జలచరములాదిగా పాతాళము యీమూడు తనకుక్షియందే యుండినన్ని, తానంటక ఒక్కటీ తాగాక అంతా తనలో యిమిడియున్నందున సర్వప్రపంచము "హరిమయము విశ్వమంతయు హరివిశ్వమయుండు సంశయము పనిలేదు, ఆహరిమయముగాని ద్రవ్యము పరమాణువు లేదు" అని భాగవతమందు పెద్దలు చెప్పియున్నారుగాన నీళ్ళలో ఆకాశమువలెనే ఈమాయ కనుపించుతూయున్న హేతువుచేత యిలాచెప్పినారేగాని ఆత్మవిలక్షణమై ఒకటిగా అంతటానిండి ఒకటీ తాగాక వున్నందుచేత నిర్గుణమువల్ల మూలంలేని గుర్తెరిగే శరీరం ఏమీలేదని గురువాక్యంవల్ల సూచన తెలిసికొని ఆత్మకంటె అన్యములేదని నిశ్చయము యెపుడు వస్తుందో అపుడు బాహ్యాభక్తుడని చెప్పబడ్డది. అనన్యభక్తియనగా నేత్రములచేత చూడబడిన రూపములను, చెవులచేత వినబడే వాక్యములున్నూ లోపల మాయారూపమైన సంకల్పములున్నూ కలియక తెలియరాదుగనుక ఈమూడువిధములను సర్వంఆత్మనుగా భావించేటప్పుడుఆత్మలో మాయారూపమైన సంకల్పముకలుగనిదే నిశ్చయము. కాబట్టి నిర్గుణముచేత అనన్యభక్తుండని చెప్పబడ్డది. ఏకాంతభక్తియనగా: భక్తియొకటేగాని రెండోది లేనందున "ఆత్మసత్యం

జగన్మిథ్య" అనే ప్రమాణముచేత తన దేహము మొదలుగా
సర్వప్రపంచము శూన్యమనిన్నీ ఆత్మపూర్ణమనిన్నీ భావించినదే
ఏకాంతభక్తి. ఈ మూడుభక్తులు కలిగినందువల్ల ఏమాయె
నంటే బాహ్యాభక్తివల్ల పుట్టడంచావడంలేకపోయినది. ఏకాంత
భక్తివల్ల సుఖదుఃఖములు లేకపోయినది. అనన్యభక్తివల్ల
పాపపుణ్యములు లేకపోయినది. 'శ్లో॥ జ్ఞానం ద్వివిధ మాఖ్యాతం
పరంభావపరం తథా' అని ప్రమాణము గనుక పరజ్ఞాన
మనిన్నీ, అపరజ్ఞానమనిన్నీ రెండు విధములు. పరజ్ఞాన మనగా:
పరులవల్లనున్నూ, కనుచూపు వినికిడివల్లనున్నూ తనకు అం
టక పరస్పరముగాయుండి ఒకప్పుడు జ్ఞాపకమున్నూ, ఒకప్పుడు
మరపున్నూ కలిగినదే పరజ్ఞానము. అపరజ్ఞాన మనగా అంతటా
పూర్ణముగా నిండి తెలియబడకుండా వున్నదే స్వరూపము.
స్వభావ మనగా: పరమాత్మఅయిన నిరాకారమునందు సాకా
రమైన సాక్షిత్వముకలుగని వేదశాస్త్రపురాణాదులు చెప్తూ
యున్నవి. స్వరూపానకు స్వభావం నిశ్చయమైతే స్వరూపం
ఉన్నమట్టుకు స్వభావం ఉండవలెను. అట్లా యుండక వేరై
తోచుచున్నది. ఏలాగంటే సూర్యుడు స్వరూపం, ఆ సూర్యు
నికి కిరణములు స్వభావము. ఎంత కాలము సూర్యు
డుండునో అంతకాలము కిరణములు యుండునుగనుక స్వరూప
నాశనములేక యుండగానే స్వభావలక్షణములకు ఏల నాశ
మువచ్చును. కాబట్టి స్వరూపమైన పరమాత్మకు జగత్తు
స్వభావం కాదు. జగత్కార్యములు లక్షణములు కాదని బుద్ధి

మంతులు యోచించవచ్చును. వేదములయందును వేదాంత ములయందున్నూ అధ్యారోపాపవాదములచేతగాని ఆత్మను తెలుసుకోరాదని అభ్యాసజ్ఞానులకొరకు చెప్పినదేగాని ఆరూ ఢులైతే యింతకష్టముతో పనిలేదు. లేనిజగములు కల్పనజేసి తిరుగా లేదనుటకంటె అధ్యాస లేకపోవటమే వాసి. బురదపూసు కొని బురదతో కడిగితే వదలనట్టు, ఈ అభ్యాసము చేయక మొదటనే గురువాక్యము చెప్పుకొని ముక్తిని బొందవచ్చును.

ఈ కేవలజ్ఞానము దృక్కుమనస్సువల్ల కలుగుతుందే గాని ఆత్మజ్ఞానం కాదని ఆత్మఅయితే పూర్ణుండనిన్ని జ్ఞాన ముతో చూడకపోతే సంకల్పము లేకపోతూయున్నది గనుక పూర్ణజ్ఞానము యేదంటే బాహ్యా అనన్య యేకాంత భక్తులు యెక్కడయున్నవో అక్కడ పూర్ణజ్ఞానమున్నది. అనగా కలిగి నందుకు సంతోషమున్నూ లేనందుకు దుఃఖమున్నూ విడచి కలిగినా లేకపోయినా రుజుపూర్ణమైయుండుట. ఇది జ్ఞానమని చెప్పబడును. వైరాగ్యమనగా సంసారమువిడచి ధన ధాన్య ములు విడచి క్షౌరాభ్యంగనాదులు విడచి దారాపుత్రాదు లనువిడచి మోహరహితుడై యుండవలెననుట కాదు. వైరా గ్యమనగా యేదంటే వ్యర్థమైన ఈప్రపంచముయందు రాగము విడచియుండుటే వైరాగ్యము. "విషయ నిరసనంబు వివరింప మోక్షంబు బంధనంబు విషయపరిచయంబు యెరుక యిదియె దీని నెరుగకయున్నను రాగమంద్రు బుధులు రమ్యముగను..." జీవాత్మయనిన్ని, సూత్రాత్మయనిన్ని, అంతరాత్మయనిన్ని,

ప్రత్యగాత్మయనిన్ని, ఈ నాల్గువిధములు స్థానభేద క్రియా భేదమేకాని ఈ నాల్గు వేరుకే. అట్టి వేరుకకు ఈ నాల్గు ఆత్మనామములు. ఏలకలిగెనంటే వివరించెద. జీవాత్మయనగా నేత్రేంద్రియముల గూడిన తెలివే జాగ్రతనుపొంది వ్యవహార క్రియలను తోపజేసి యా యా చోట్లను పొందినందున జీవాత్మయని పేరు. సూత్రాత్మ యనగా పూసలలో దారము వలె పిపీలికాది బ్రహ్మపర్యంతము రూపనామ సహితముగా సమిష్ఠిగానుండి వ్యష్టియనుభవమును పొందేదికాబట్టి సూత్రాత్మయని పేరు. అంతరాత్మ యనగా, హృత్పద్మమందుండి జాగ్రత్ స్వప్న సుషుప్తులను మూటి అనుభవమును గని తురీయమైన నాలుగో అవస్థను అయినించి సంకల్పమును వికల్పమును చేసేదై నందున అంతరాత్మయని పేరు. ప్రత్యగాత్మయనగా దేహము కలియక విడిచినట్టున్నూ లేక సర్వసాక్షిత్వము కలిగినట్టున్నూ యున్నందున ప్రత్యగాత్మయని పేరు. యిన్నింటికి వేరుక ప్రధానమైనదిగనుక అట్టి వేరుకను గురువాక్యమనే 'నేతి నేతి' వాక్యోపదేశములచేత కాదు కాదనవచ్చును. ప్రత్యగాత్మకు సాక్షిత్వమున్నూ పరమాత్మకు పూర్ణత్వమున్నూ భేదమేకాని గురువాక్యముచేత సాక్షిత్వమునువిడిస్తే పూర్ణత్వము యొక్కటే నిలచును. కలియక తెలియనేరదు కనుక కలిసి తెలియరాదన్నమాట. ఆత్మకలిసి ప్రపంచమును తెలుసుకొనరాదని చెప్పుట. శ్లో॥ ఆత్మసత్యం జగన్మిథ్యగా భావించిన పురుషుడు ద్వైతాద్వైత విశిష్టాద్వైత యుక్తమయిన పరమ

తత్వమును పొందును. ఈ రహస్యమంతయు శ్రీ గురురాయుని ద్వారా తెలుసుకొని మోక్షప్రాప్తిని పొందుము.

---

## వర్ణప్రథమ షోడశీ వృత్తమాల

చం॥ మూలములేని గుర్తెరుగు ♦ మోహశరీరమనే రహస్యమీ
నేలనుగల్గు సద్గురువుసిన్ బొడగాంచి♦పదంబులంటి యా
మూలముదెల్పుమంచు తన♦ముఖ్యమనంబు పరీక్షయిచ్చినం
కాలిచివేయు భ్రాంతులను♦కర్మములన్ని నశించునిక్కమా.

ఉ॥ లంపటమున్ హారించు ♦ సురలందరినర్చనచేసి మ్రొక్కినన్
కుంపటితోటి యంతపని గూడక ♦ నుండునో నంతెగాని తా
రంపముతోటి దూలము కరంబున ♦గోసినయట్లుగాదు యీ
కొంపను నమ్మకన్ గురునికోమల♦పాదములంట కార్యమా.

ఉ॥ క్లేశము రోషభ్రామిక శరీరభిమానము ♦ చింతగర్వమున్
ఆశ పరాకులేకను పదార్థము ♦ యంగనలందు మోహముం
బాసి మతాభిమానములు వంచి♦ సమస్తసమానభావముం
భాసిలు చిత్తమందునిచి ♦ భద్రమునున్న ఫలంబుజన్నమా.

చం॥ నిజగురుమూర్తి పాదములు♦నిక్కమునమ్మిభజింప బూనినన్
సుజనులుమెచ్చుచుండ్రు♦సుందరులందరు యోగ్యుడండ్రుభూ
ప్రజలు సమస్తమార్గముల♦భక్తినిగొల్తురు యట్లుగాక సా
మజగతిగర్వియైనదువ♦మాన్యుడుగా.ద్వేధవన్న యాతడున్.

చం॥ గుణములుమంచివై మిగుల ♦ కోర్కెలులేక ధరిత్రియందు శ్రీ
గణములు వచ్చినం దెమలకం మతి ♦ నిల్పిన వాడుభోగియా
ఋణముకు ద్రవ్యమాదులకు ♦ రోసినమర్త్యుడు సౌఖ్యుడౌననం
రణజితవంతుడైనను ప ♦ రాలలనుండిన హానిజాతమా.

చం॥ రుజలు ప్రకోపమైనపుడు ♦ రూపములన్ని హరించినట్లుగా
సుజనులు చింతబొందగను ♦ సుందరముంగనన్నైన నేమియా
సుజనుల కేమికీడు యిలచోద్యము ♦ సజ్జనులంత మెత్తురే
కుజనులు సంతసింపుదురు ♦ ఘోరమదంబున వారికర్మముల్.

చం॥ తెలివిగనున్న కాలమున ♦ దీక్ష వహించియు రాజయోగముం
సులభగతింగ్రహించి పర ♦ సుందరులంధనమాది భ్రామికల్
కలయని బుద్ధినిల్పి తన ♦ కాయమునంటదియందు నిశ్చయమున్
దలచిపరేశునిన్ మిగుల ♦ ధ్యానమొనర్చుచునుండగావలెన్.

ఉ॥ రిక్తకథల్ వచించిన బలేయని ♦ లోకులు మెచ్చుచుంద్రియా
భక్తికినేమనందు నిజ ♦ భావముగానగు నిష్ఠపూర్ణుడై
శక్తిగలట్టిమానవుల జేరగ్రహించరు ♦ యట్టిమూర్ఖులున్
వ్యక్తులుగాని హేతువని ♦ వేదగ్రహింతురు వాని నగ్రజా.

చం॥ గేలములందు నెరలను గ్రేలుచు ♦ గుర్చిమదించిచేపలం
నేలగలట్టితోయముల ♦ నేటుగబట్టుచు చంపుచుంద్రి తా
తాళిమిగల్గి చూడగ యథార్థము ♦ తోచును హింసపాపమం
చాలిసుతాది మోహములు ♦ యిట్టివిగావ ఔ మూర్ఖమానసా.

చం॥ శరములు బూనవచ్చు రథ♦సారధి తానవచ్చు శత్రులం
దరమదలంపవచ్చు పర♦తంత్రములన్ని హరింపవచ్చు తా
కరమున మంచి కార్యమని ♦ గ్రాసముకివ్వగ లేదు దుష్టు డీ
వరుస నటించుచుండు పర♦భావములందున బుద్ధిశూన్యుడై.

ఉ॥ రీతులెరింగి దుర్గుణము ♦ లేశమ యైననులేక మిక్కిలిన్
ఖ్యాతిగలట్టివాడయి సు♦ఖంబున ద్రవ్యముగల్గియుండియుః
హేతువులేని వాక్యములు♦ హెచ్చుగ కల్పన జేయుచుండ్రు యీ
రీతి జనాళి భావములు♦ రేబగలంచను నేమి హేతువో.

ఉ॥ రంకుతనంబు బొంకులుప♦రాకు నుదంబుధనాశ భ్రమికల్
జంకుతనంబు శంకలు వి♦చారము క్రోధము పంతపంకముల్
మంకుతనంబు రోషము ప్ర♦మాదము సేయుట మానిచక్కగా
పొంకముగల్గియుండవలె♦ భూరిబలాఢ్యుడు వాడు చూడగః

ఉ॥ యేమివిచిత్రమో గుణము♦ యెట్టిదో నిర్మలజ్ఞప్తి యెట్టిదో
కామము యెట్టిదో సుకృత♦కర్మము యెట్టిదో జ్ఞాన మెట్టిదో
భూమినిగల్గు వారలలో♦ భూరిగుణాఢ్యుని గాంచి మ్రొక్కియున్
సామముచేత బోధగాని♦ చక్కగ నుండవలెం ధరాస్థలిః.

ఉ॥ మీరక బ్రహ్మవిద్యను ప్ర♦మేయము దల్చిన దూరుచుండ్రుని
స్సారపువిద్యయైనను ని♦జంబుగ పూర్వులు యేల నేర్చిరో
వారిని చెప్పగావలయు♦ వారు యెరుంగరు యిట్టివారినిః
నారిసమానపుంసకులు♦న్యాయము యెరుంగును యిద్ధరాస్థలిః.



7

ఉ॥ లేనిప్రసంగగోష్ఠులకు ♦ లెస్సగనేగుచు ఘర్షనాడుచున్
మానకయింకప్రజ్వరిలు ♦ మర్త్యులనేకులు గల్గిరిద్ధరన్
హానిగలార్జనంచు మది♦యందొకమారు దలంచనట్టి యా
మానవజన్మమేమిటికి ♦ మాయ సమస్తము చిత్తగింపుడీ.

చ॥ దురమునశింపజేయవలె♦దుఃఖముబాపవలెం మహాత్ముడై
పురికొనిపాపసంచయము♦ముఖ్యముగా హరియింపజేయ శ్రీ
కరగురుమూర్తిగాంచవలె ♦ కర్మవిచారణచేయగావలెన్
నరములకుప్పయేమిదును♦నాథుగనుంగొనిమ్రొక్కగావలెన్.

"మూలంలేని గురుతెరిగే శరీరం యేమీలేదు."



# భక్తియోగప్రకరణము

## కీర్తనలు

వసంత—ఏకతాళం.

ఏమనంటినాదికేశవా లక్ష్మీసమేత ॥ఏమనంటి॥

ఏమనంటినయ్యానిన్ను యెందుజూడనందెగల్గు స్వామివనుచు
వేడుచున్న కామితమిడకుంటివోర ॥ఏమనంటి॥

సూపులేనివాడవంటినా కాపురములేక చూపరులకు చూపరం
టినా ప్రాపులేకయబ్ధిలోన చేపరూపమైచరించి సూపుకంద
రానికమఠ రూపధరుడవంటిగాని ॥ఏమనంటి॥

బురదడాగువాడవంటినా యదిగాకనిన్ను నరమృగంబవైతి
వంటినా పరమపురుషవటుడవయ్యు బరువడి మూడడుగులడిగి
కోరిబలిని ఘోరముగా కూలవేస్తివంటిగాని ॥ఏ॥

చేతిగొడ్డలిబ్రతుకటంటినా యిదిగాక స్త్రీని ఘాతజేసినవాడ
వంటినా ప్రీతితోడతల్లివిడచి పెరిగిగజపురంబుజేరి ఆతురతతో
వంశనాశ మాచరించితంటిగాని ॥ఏ॥

తలప బుద్ధరూపమంటినా పలువిధముల స్త్రీ వలపుజిక్కువాడ
వంటినా కలియుగాంతమందునీవు కలికివేషధారుడవై తులువ
గుణములెల్లమాన్పు దొరవనిదలకొంటిగాని ॥ఏ॥

చోటపురినివాసమంటినా యదిగాకను వైకుంఠపురములేదటం
టినా బూటకంబదేలశ్రీతో ముగ్గురభార్యలగూడి వాటముగా
కూర్మరాయు వద్దనుండమంటిగాని ॥ఏమనంటి నాదికేశవా॥

శంకరాభరణము—ఆది.

కావ్వినరాభోదయా శ్రీగురుభక్తి హరిగురుభక్తి కావ్విన
రాబోదయా॥

శ్రీహరిభక్తి మూర్ఖులకెల్లా ॥కావ్విన॥
చాల్ చాల్ నగొడ్డాళ్ళతో చీల్చిమూర్ఖులవాత
తాల్చినదుమ్మగొట్టి చీల్చి పేల్చిత్రిప్పితిప్పి ॥కావ్విన॥

భాగావతూలకెల్ల సాగిలీమొ్రిక్కుమాని
బాగాయగ్నినిమెరిగ కాగినగరిటబెట్టి ॥కావ్విన॥

సుజనూలపొందుగూడి గజవరదూనిపాద
భజనజేయూమనుచు గజపూటమునబెట్టి ॥కావ్విన॥

రంగూగా గురునకుసాష్టాంగముజేయుమాని
సంగతిగాగొప్పా ఫిరంగివాతానుబెట్టి ॥కావ్విన॥

గురునితొలుతానుశ్రీహరునివేడుమాని
పరిపరివిధములజెప్పి కొర్విత్తోడూతమూతి ॥కావ్విన॥

నోటశ్రీగురువాక్యం సూటీగబలుకమని
మాటికినిజెప్పి వల్ల కాటీలోపండబెట్టి ॥కావ్విన॥

తిన్నాగసుబ్బారాజ దేశికేంద్రూనిమది
సన్నూతిసేయుమాని సున్నంపుకాల్వనుబెట్టి ॥కావ్విన॥

మెన్నోవిధములగురుని సన్నూతిజేయుమాని
కన్నినకూర్మారాయుని విన్నాపము:వినవివారి ॥కావ్విన॥

## భక్తియోగ ప్రకరణము

హిందూస్తానీరాగం—ఏకతాళం.

దశరధనందన దానవహరణా పశుపతిమిత్ర ఓ పరమదయాకర॥
నిత్యా నిరంజన నిర్మలరూప సత్యపాలనా సామగానాప్రియ ॥దశ॥
ఖరకరవంశజ కంతుజననీప్రియ సరగునదశముఖు సంహారించీన
రామా ॥దశ॥

సర్వలోకాధార సద్గుణసామ్రాజ్య సర్వభూతప్రియ సాధు
జనావన ॥దశ॥

మత్స్యకమఠాకిటి మానితనరసింహ
స్వచ్ఛవామనరామా రామబలరామకృష్ణ ॥దశ॥
బుద్ధకల్కిరూపమున పొందుగనటనజేసి
అందముగచౌటపురినింపొందుగావసియించియున్న ॥దశ॥
సతతముశ్రీకూర్మరాయు సరగునబ్రోచేదనని
విదితముగశ్రీలక్ష్మితో వేమారుపంతాముజేయు. ॥దశ॥

ముఖారిరాగం—అటతాళం.

హరినా మొరవినిరావదేర శ్రీహరి నరహరినా మొరవినిరావదేర॥
హరినా మొరవినిరావదది ఏమిపంతాము
సరగునరాకున్న సైచానుమరిజూడు ॥హరి॥
గజరాజుఏమైనా ఘనమునీకిచ్చేనా
అజసుతులేమైనా హారములొసగేనా ॥హరి॥
పాండవులేమైనా ఫలహారమిచ్చేర
పుండరీకుడునీకు బండారమేమిచ్చే ॥హరి॥

దుౣపదపుత్రినీకు సఫలమేమిజేసె
కపటమానసుడొాల నుపమింపదెలసెను ॥హరి॥
అలకుచేలునిచేతి అటుకులుదినిచాల
జలజసంభవవినుత జయమొసగిబోౣచితివి ॥హరి॥
లంచాగాడవని కొంచమెరుంగక
సంచీతమెడలించే సామీావనిదలచితి ॥హరి॥
వంతాము సేయక చెంత జేర్చినీవు
సంతారించినన్ను సమరసునిగాజేయు ॥హరి॥
సర్వజీవకోటి నాకేడిపౣభువని
యుర్వీజనులందరు యుపమించిరికనైన ॥హరి॥
ధరకూర్మరాయుని దసునేలుదొరవాని
పరిపరివిధముల పౣస్తూతిజేసీతి ॥హరినామొరవినిరావదేర॥

నాటరాగం — ఆది.

నిన్నేనామదినమ్మితీ శ్రీకేశవా నిన్నేనామదినమ్మితీ॥
నిన్నేమదినమ్మితి పన్నగశయన యాా పన్నరక్షకసదా సన్నుతి
చేయుచు॥ని॥
పక్షివాహాన నన్ను పాలించుటకునేడు పాక్షీకమనీకు పాల్మాలిక
దేవ॥ని॥
అనుదినమును నిన్నే ఘనముగవేడితి మనుజవైరివైరి మన్నించు
మికనైన॥ని॥
సరసీజనయన ఓ సర్వశరణ్యుడా కరిరాజవరదా నకా కరుణా జూ
డవెవేగ॥ని॥

పురహారమిత్రిమా పురుహూతపరిరక్ష యరవిందనేత్రి నా కభ
యమియ్యగరాదె॥ని॥

నీరజగర్భాది నిఖిలలోకస్తోత్రి నారాయణాచ్యుత నరసింహ
శ్రీధర॥ని॥

ధరచౌటపురియందు స్థిరముగ నెలకొన్న వరలక్ష్మీపతి నిన్ను వద
లక ప్రార్థింతు॥ని॥

ధరసుబ్బయార్యశ్రీ గురువర్యుకరుణచే
వరకూర్మదాసుడన్ పరిపరివిధముల॥నిన్నే నామదినమ్మితి॥

ధన్యాసి—ఆట

వద్దురానావద్దరాకురా ఓబాలకృష్ణా ॥వద్దురా॥
నవనీతచోరా నందకుమార యశోదకుమారి ॥వద్దురా॥

వద్దురాయీబుద్ధిమాను కొద్దివయసుదాననేను
రద్దిఏలచేసెదార కొద్దిపనులకురాకుపోరా ॥వద్దురా॥
కన్నెప్రాయపుదానరా కనుసన్నలుజేయుట తగదు
వన్నెకాడ వలదుపోరా తిన్నగాసరసాకురాకు ॥వద్దురా॥
వారకాంతనుగానురా నను నేరమెంచకిమానరా
సారమేమియులేదురా యిక వారిజాక్ష కోపముంచకు ॥వద్దురా॥
మోహమేమిక సారమురా యూహాలన్నిమానిపోరా
సాహసంపుపనులు మానర సారసాక్ష కరుణయుంచి ॥వద్దురా॥
భాసురముగాకూర్మరాయదాసునీ ఏమరక నీవు
గాసిజెందక చౌటపురినివాసులను రక్షించు దయను ॥వద్దురా॥

మధ్యమావతి—అట.

ఉంచకుముపరమేశ్వరా పరలోకమునకంపించు మిాభూతేశ్వరా॥
ఉంచకూయీపృధివిలోన పంచమహాపాతకులను
కొంచకతలిదండ్రిగురువుల వంచనలుజేసేటివారిని ॥ఉంచకు॥
మచ్చరించేవారినీ మధుసూదనునికథ లుచ్చరించనివారినీ
హెచ్చుగాగురుధర్మమునకు కక్షబూని పెచ్చురేగి
యిచ్చవచ్చినట్లుగాను తుచ్ఛపుమాట్లాడువారిని ॥ఉంచకు॥
కారులాడేవారిని కంసారికథవిన పాలుమాలినవారిని
కారణంబేమియునులేక సారసాక్షునిభక్తులాను
తేరిచూడకసూరిజనులతో కూ్రరముగభాషించువారిని ॥ఉం॥
వాదులాడేవారిని సాధులనుజూచి మోదమొందనివారిని
కాదుకాదనివేదసాదల నాదరింపక వాదమాడియు
బాధపరచుచుపందలై కడు భేదవృత్తిమెలంగునీచుల ॥ఉంచకు॥
సూరిజనుల చేరక హరిహరులచర్యల నారమరయజాలకా
సారసాక్షుడైన కేశవసామిని ప్రార్థించమాని
దూరికమఠరాయదాసుడు సారమిదియనమీారువారల॥ఉంచకు॥

## కృష్ణలీలలు

వసంతరాగం—అటతాళం

పిల్లతల్లిని వల్లగాదురా ఓబాలకృష్ణా
గోపాలకృష్ణా నందకుమారా ॥పిల్ల॥
పిల్లతల్లినినేనుగదరా అల్లపనులకుతాళజాలర
కల్లగాదిది మల్లిపోరా అల్లరిజేయూకుసామి ॥పిల్ల॥

పట్రివ స్తనమూలుజూచి వలపునిలుప లేవదేమి
పట్టిజూచినపసయు లేదు పాలబింక మెకానిసామి ॥పిల్ల॥
దేహసోయగ మెంచిపై బడి సాహసంబునపట్ట రాకుము
దేహమూ వెల్లులివాసన మోహపడుట దేమిసామి ॥పిల్ల॥
ఇంకకొన్ని నెలలు జరుగగ బింకమా నా దేహ మపుడు
పంకజాక్షు జంకు లేక అంక పాళి నుండగలను ॥పిల్ల॥
తామ్రచూడా కేళి కిట్లు దడదడాలాడాకు సామి
సంబ్రపడుటకు వేళగాదిది సాహసించిన లాభమేమి ॥పిల్ల॥
వాసిగానట్లూరికూర్మదాసరాయ వలదువలదిక
మోసపుచ్చకు శ్రీశ నీకిదె మ్రొక్కెదను మన్నింపుమిపుడు ॥పిల్ల॥

కాంభోజిరాగం—ఆదితాళం.

తొందరాపడుటాకు యిదియు సంధ్యవేళరా.
ఓబాలకృష్ణా గోపాలకృష్ణా ॥తొందరా॥
అందముగ కెమ్మోవిరదముల సందుమనోవిందుజేసి
పొందుగోరవచ్చెదావు మందయానలుగాంతురేమో ॥తొం॥
మాడవేయని సూర్యహారాలూస్పవచ్చేవూ ॥ఓబాలకృష్ణా॥
పోడిమిగ మాభావగారు వాడవాడలు దిరిగివచ్చి
నాడలొాదిలేసమయమిది మాతోడికోడలుభావికరిగెను ॥తొం॥
ఇందవేయని చంద్రహారములివ్వవచ్చేవు ॥ఓబాలకృష్ణా॥
సంధిదీ యారాలువదిన నిందలాకు మూలమౌను
మెందు దాచుకొందు సామి ముందుమెవుడేనిత్తుగాని ॥తొం॥

నన్నలుసైగాలుజేసి కన్నుగీటేవు ॥ఓబాలకృష్ణా॥
కన్నవిన్నవన్నెకాదు చిన్నిమాటలాడి నన్ను
మన్ననగూడగనివడు మాటదక్కించుకో నేడు ॥తో॥
భాసురముగా చాటపురినివాసకేశవా ॥ఓబాలకృష్ణా॥
దాసుడౌశ్రీకూర్మరాయుని బాసియుండనాని నన్ను
హాసమేలజేసెదావు వేషభాషలు మాను యికను ॥తో॥

వసంత — ఆట.

ఎన్నిమాయలు నేర్చినాడమ్మా యశోద నీకొడుకెంతదుడుకని
చెప్పగలమమ్మా॥
నిన్నరేయొకసారి యితడు కన్నుమరుగుగానువచ్చి
చన్నుమొనగోనగోరచీరి కన్నన కెమ్మోవిగరచెను ॥ఎన్ని॥
సందర్భామునమూలదాగేను మేమెవ్వారెరుగము పొందుగా
పడకిల్లుజొచ్చేనే
అందరము నిదురించగా నా సందుగని మాయాడబిడ్డను
కొంగుబట్టుదొలగించి పైబడి అంగనామణి భంగపరచెను ॥ఎన్ని॥
అంగనామణిరో వినవే నీకొమరుడెంతో వెంగలీపనులకు
జొచ్చేనే
సంగతిగ మాపడుచులందరు గంగసేవకుబోవుచుండగ
చంగుచంగునవచ్చిమాపెదరంగిని బిగికౌగలించెను ॥ఎన్ని॥
ఎంత మోసముజేసినాడమ్మా నేదెల్పుటకుబహువింతగా
జూపడునుగదవమ్మ

యింతియొక్క తెరాతిరిబహు మంతినంబున భర్తగూడగ
యంతలోనా వెనుక జేరి స్వంతమువలెకళలుబట్టెను ॥ఎన్ని॥
మాసనీమణి వినవెయీాతడు మామానధనమటు చానరో మరి
చూరబుచ్చేనే
చానలందరుగుమియుగూడొకచోట వెన్నయునమ్మచుండగ
కానకుండగవచ్చి పిడతలలోన వెన్నహరించివెళ్లెను ॥ఎన్ని॥
వీని చేష్టలు చెప్పలేమమ్మా యికనైననీవు యానచేయక నిలువ
లేమమ్మ
యెన్ని చెప్పినానువినక మన్ననగ మరుకేళి దేలుచు
వెన్నుడూశ్రీచౌటపురిలో క్రిన్ననవేంచేసియుండును ॥ఎన్ని॥
దానుడౌశ్రీకూర్మరాయుని యెడబాయకను మము గాసిజేసి
కేరుచుండును
వాసియా యిటువంటిపనులు దోషబహుళంబౌను నిజమిది
మోసగాడితడన్నిటికిని కేశవస్వామడుగులాన ॥ఎన్ని॥

పూరికల్యాణి—ఆది

వద్దురాయిాలాటిపనులు గోపాలకృష్ణా ॥వద్దురా॥
ఓబాలకృష్ణా నాచిన్నికురారి నవనీతచోరా ॥వద్దురా॥
వద్దురా యిార ద్దదెందుకు హద్దుగామనయింట నుండుము
బుద్ధిలేనిగొల్లలంతా వద్దికతో నిను రద్దిజేతురు ॥వద్దురా॥
కన్నెలందరుగూడిమరిమరి పిన్నపనులనుజెప్పగానే
విన్నజాడాలన్నిమాని మన్ననగమనయింటనుండు ॥వద్దురా॥

ప్రొద్దుప్రొద్దున లేవగా నా వద్దనుండుటమానినీవు
పెద్దిబోయినవారిలచ్చిని ముద్దుపెట్టినావటంట ॥వద్దురా॥
నిన్ననుసాయంత్రివేళ కన్నెలందరుచేరియుండగ।
యన్నవారిచిన్నదానిని చన్నుచీరి కరచినావట ॥వద్దురా॥
మొన్నను మగనాలియైన సన్నంవారి పిన్నపడుచును
కన్నుసైగ జేసిరమ్మని చిన్నిమోవి నొక్కినావట ॥వద్దురా॥
ఇట్టిపనులను మానకున్నను గట్టిగా శ్రీచౌటపురిలో
గట్టివేసి కూర్మరాయుని దిట్టముగా కావలుంచెద ॥వద్దురా॥

శహన — ఆది

నందనందన యిటురారా నాసందేహ మెడలించవేరా ॥నంద॥
పొందిమీపాదారవిందముల్ పూజింప
డెందామునందా నందమునొందెదా ॥నంద॥

వాసుదేవానన్నుబ్రోవుమీ దాసునిగజేసుకోవ
దాసరక్షకబిరుదు దాచుకోవశమానా
ఈశ పరాత్పర దోసములెంచాకా ॥నంద॥
అఘనాశాకరుణించరాదా ఓజగధీశనాతోడవాదా
అగరూపమున నీ వమరేశువంచించి
వగబొందాభీరులనగ మెత్తినబ్రోచిన ॥నంద॥
దశవేషధారియిటురార నేనీవశమైయున్నా నేలుకోర
పశుపతిమిత్రఓ పరమదయాకర
విశదముగా నన్ను వశపరచుకొనుటకై ॥నంద॥

నీవే నేనని చెప్పరాదా ఓహో కావుమనుట పెద్దవాదా
నీవాని నేనానని నిజమార్గ మెరుగాక
భావింపుచుంటిని పరమదయాకర ॥నంద॥
ధరచౌటపురియందు నిలచి దాసవరులనురక్షింపదలచి
అరమ రేమియు లేక యందరియందున
స్థిర మైకూర్మ రాయదొరవై వెలసిన దేవ ॥నందనందనయిందు రార॥

శ్రీ లక్ష్మీదేవి మంగళహారతి

పరగ శ్రావణమాస పర్వమున విరివిగా కర మొప్ప శుక్ర వారము రోజున విరివిగ స్త్రీలంత ఏకాహామునన్ను యరసి స్త్రీజనులంత యర్చింతురూ॥ జయమంగళం నిత్యశుభమంగళం జయాజయమంగళం మహోత్సవ మంగళం॥ కనకవిగ్రహాము లను క్రమముగా చేయించి కనకాంగులందరు క్రమముతోడ ఒనరగా నేరేడు ఉత్తరేణితులసి ననలుసుమములతోడ నర్పింతురు ॥జయ॥ గంధమక్షతలును పొందుగా నర్పించి అంధముగ సాంబ్రాణిధూపమిచ్చి క్రిందుగా విరజాజిపూలచే పూజించి కుందరదనలు భక్తి గొలుతురెపుడూ ॥జయ॥ ధూపదీపములిచ్చి తృప్తిగా నైవేద్య మొప్పుగా పానకము వడపప్పులు కప్పురంపు నరటిఘననారికేళములు తృప్తిగా నతిరసాలర్పింతురు ॥జయ॥ ఉత్సాహ మొప్పంగ యువిదలందరుగూడి అచ్చగోక్షీరాన్న మమరనునిచి పచ్చకర్పూరంపు తాంబూలములొసంగి హెచ్చుగా నివ్వాళు లిత్తురెపుడూ ॥జయ॥ శాశ్వితైశ్వర్యములు చెడని

మాంగళ్యములు విశ్వజననీ నిన్ను వేడుకొనుచు వశ్యులై జను లంత ఒనరైనపాటలతో హాస్యరవములుమాని యర్చింతురు ॥జయ॥ఆదిలక్ష్మీనిన్ను అందముగపూజించుమందయానలకోర్కె మదినిత్తువు మందరాధరురాణి మాయింటనివసించి కుంద రదనా మమ్ము కూర్మిగనుమూ ॥జయ॥ అరలేకశ్రీచౌటపురి లోననివసించు శ్రీకేశవునిరాణి స్థిరముగాను పురిజనులకంద రికి పూర్ణసంపదలొసగి వరలక్ష్మినీవుందు వసుసన్నిధి ॥జయ॥ చిరభక్తుడైనట్టి శ్రీకూర్మరాయుని దరతరంబునగాచు దైవ తమవు మారజననీ సర్వ మంగళప్రదవయ్యు వారకైశ్వర్య ములు ఒసగుమెప్పుడూ ॥జయమంగళం॥

## సీతాదేవి వప్పగింతపాట

వెళ్లిరాసీతమ్మ వెళ్లిరావమ్మ వెళ్లిమీఅత్తింటవద్దికతో మెలగు॥ ఎవ్వరేమనినను యెదురాడబోకు అత్తమామల యాజ్ఞ కడుగుదాటకుమీ ఆడుబిడ్డలయందు నతిశ్రద్ధ మెలగు బావమరదులయెడల భక్తితోతిరుగు॥ పొరుగిళ్లకేపొద్దు బోకుమీతల్లి పోరాటమెవరితో జేయుబోకమ్మ తిరచుతల వాకిట నిలబడకుమమ్మా యిరుగుపొరుగువారి కితవుగా నుండూ॥ పతియెదైవంబని భావమందుంచు పనిజేయుసమయ మున దాసివలెమెలగు భోజనముపెట్టునెడ తల్లివలెనుండూ శృంగారమున మహాలక్ష్మిగావలెను॥ శయనించుసమయమున రంభవలె మెలగు వ్యవహారసమయమున మంత్రివలెనుండూ

ఓర్పునా భూమితో సమముగానుండూ యెందరెట్లన్నను యేమరకయుండూ॥ ఈ ఆరువిధములను యిష్టముగనున్నా అత్తవారికియది ఆనందమౌను॥ కన్నవారికి మహానంతోష మొదవు చిన్నతనపుపనులు జేయబోకమ్మా॥ అమ్మరో మనసునా బెంగుంచుకోనకు అతివలకుసతమైన దత్తవారిల్లే॥ మతినినూహించవే మంచిశబ్బరలు అత్తగారలయెడల నతి భక్తిజూపు॥ ముద్దుగాచూచెదరు ముగ్ధరో నిన్ను మామగారిని తండ్రిమారుగాజూడు పరిచర్య లేమరక పాటించిసేయా మనువు వారందరు మన్నించెదారు॥ భర్తకోపించినా పాటిగాగనకు చెలిమికత్తెలకైన చెప్పరాదమ్మా॥ పలుచనిగజూచెదరు బాల రోనిన్ను చిరుదిళ్లకోసమై చింతిలకుమమ్మా అన్నదమ్ముల చేత నంపెదముతల్లీ జాజులుమల్లెపూల్జలతారుచీర్లు వేడుకతో పంపెదను వెలదిరోనీకు॥ పెద్దలుపిన్నలు వచ్చుసమయముల వద్దికగయుండవలె ఉత్ఫుల్లనేత్రి పెద్దవారలయందు శ్రద్ధగా నుండూ॥ పుత్రపుత్రీపౌత్ర వృద్ధిగల్గూను సతమీవాక్యముల్ సత్యమని నీవు మతియందునిల్పినను మన్ననలుగల్గూ శ్రీరాము సాక్షినుమి చెప్పితినికోమ్మా ఆరాముడెప్పుడూ ఆత్మలో నుంచూ ॥వెళ్లిరాసీతమ్మ వెళ్లిరావమ్మ॥

శ్రీరాగం — చాపుతాళం

లాలిలాలీలాలిలక్ష్మీసమేత లాలిశ్రీచౌటపురిపాలహృషి కేశా ॥లాలి॥ ఆదికేశవయన్న యాదరించెదవు నారాయణా యన్న నరులబ్రోచెదవు ॥లాలి॥ మాధవాయనువారి మన్నించె

దావు గోవిందయనగానె కోర్కెలొసగెదవు ॥లాలి॥ విష్ణుదేవా
యనిన వేడ్కజూపెదవు మధుసూదనాయనిన మహిమలొసగె
దవు ॥లాలి॥ త్రివిక్రమాయనిన తెగునుభవలతలు వామనా
యనగ మా వైపుజూచెదవు ॥లాలి॥ శ్రీధరాయనువారి చింత
లణచెదవు హృషికేశయనువారి వృద్ధిగాంచెదవు ॥లాలి॥ పద్మ
నాభాయనిన భవము లణచెదవు దామోదరాయనిన ధన్యు
జేసెదవు ॥లాలి॥ సంకర్షణాయనిన శంకదీర్చెదవు ప్రద్యుమ్న
యానువారి పట్లనిలిచెదవు ॥లాలి॥ వాసుదేవాయనిన వైపు
జూచెదవు అనిరుద్ధయనువారి నాదరించెదవు ॥లాలి॥ పురు
షోత్తమాయనిన పొంతనిలిచెదవు అధోక్షజాయనిన యలర
జేసెదవు॥లాలి॥నరసింహాయనువారి నరసిబ్రోచెదవు అచ్యుతా
యన మహా స్వేచ్ఛజేసెదవు ॥లాలి॥ జానార్దనాయనన్న జన్మ
బాపెదవు ఉపేంద్రయన నుపరితోవజూపెదవు ॥లాలి॥ హరి
హరియనగానె హరమాను భవము శ్రీకృష్ణయనిపిలువ శ్రీలొ
సంగెదవు ॥లాలి॥ ధరసుబ్బరాజ సద్గురుపుత్రుడైన శ్రీకూర్మ
దాసునిల చేపట్టుమెపుడు ॥లాలీ॥

పూరికల్యాణి—అట.

ఇందిరేశ చెన్నకేశవా నను బ్రోవరారా ॥యిందిరేశ॥
ఇందిరేశచెన్నకేశవ పొందుగ ననుబ్రోచుటకును
నందనందన జాగుసేయకు వందనమొనరించెద హరి ॥యిందిరేశ॥
ఎంతవేడుకున్న నీవు పంతమేలజేసెదార
కంతుజనక సంతసమున చెంతజేరి గావర హరి ॥యిందిరేశ॥

సారసాక్ష నీరదాభ వారణేంద్ర హృన్నివాస
సారసగర్భాదివందిత చేరదీసికావర హరి ॥యిందిరేశ॥
శేషశయనదాసపోష వాసుదేవ దోషహరణ
ఈర్ష్యయింతలేక నన్ను తోష్యమొంద జేయుర హరి ॥యిందిరేశ॥
వాలాయముచాటపలినివాసచెన్నకేశరాయ
చాలకృపనుకూర్మగాయు నేలితివి మహేశవినుత ॥యిందిరేశ॥

## జోలపాట

### శ్రీరాగం—అటతాళం

జో యాదికేశవా జో రమాధీశ జోసర్వభూతేశ జోపాప నాశా॥జోజో॥ శ్రీమించుక్షీరాబ్ధి శయనుడానిన్నూ కామించి వర్ణింపగా వశమెమాకు ॥జోజో॥ ఆదికేశవ మిమ్ము యాత్మలో నెపుడూ మోదముతో పరమేష్ఠి ముందుగాగనెను ॥జోజో॥ మీరూపు మీసొంపు మీ పెంపు తెంపు మీనామమహిమెన్న మేమెంతదలప ॥జోజో॥ శ్రీమించుమీనమై జలధిలోజొచ్చి సోమకునిబరిమార్చి సొలసితివి స్వామీ ॥జోజో॥ కచ్ఛపంబైనీవు హెచ్చైనసనగము అచ్చముగ మోయునా యలసటదీర ॥జోజో॥ కిటిరూపమై సర్వ పటిమజూపుచును పటుభారమాధరను బట్టి యెత్తితివి ॥జోజో॥ నరసింహరూపమై నార్యులుమెచ్చ ధర కనకకశ్యపుని దగజంపితీవు ॥జోజో॥ పరశురాముండవై పలుమార్లునీవు వరుసగా రాజులను వధియించినావు ॥జోజో॥ వటువేషధారివై వాసవునికొరకు పటుబలాధికుడైన బలిసి

ద్రొక్కితివి ॥జోజో॥ దశరధునిసుతుడవై తాటకినిదునిమించి దశ కంఠుబరిమార్చి ధరణిబ్రోచితివి॥జోజో॥రోహిణీసుతుడవై రూఢి వెలయగను బాహుబలమూచేత పరిబలితివి దేవ ॥జోజో॥ వసు దేవునకపత్య వరముదీర్చుటకై వచ్చివల్లవులిళ్ళ మురిచ్చిలించి తివి ॥జోజో॥ బుద్ధరూపుండవై బుధులు మెచ్చగను బద్ధనరులకు చాల బుద్ధులొసగితివి ॥జోజో॥ కలివేషధారివై కలుష మానవుల పలుమారుసాధించి పవ్వళించితివి ॥జోజో॥ ధర చౌటపురియందు యిరవుజేసుకుని పురజనులరక్షింప బూని యున్నావు ॥జోజో॥ స్థిరతరంబుగ కూర్మదాసునిబ్రోచి పరమ దయానిధే పవళించితౌర ॥జోజో॥

## మేలుకొలుపు

భూపాళరాగం—ఆదితాళం.

తెల్లవారవచ్చె దేవకీనందన దేవతోద్ధారకలేరా॥ కల్ల లాడుదానగాదు రేపుతిరిగమళ్ళీవచ్చెద స్వామిలేరా ॥తెల్ల॥ అల్లారి మాయత్త యదికొంతజేసూను ఫుల్లాబ్జదళనేత్రలేరా చల్లానికరుణాచే యుల్లమలరగనీవుసల్లాపాలాడెదవులేరా॥తెల్ల॥ ఇంతపంతమేల సంతోషమేసీ యంతరంగమునుంచి లేరా॥ పంతాముయేలనో పాలించునాస్వామి రంతూపాల్పేయకలేరా॥ తెల్ల॥ వదినగారుమంచి వరజాణయాగాని పదిలముగ బోవ లెనులేరా॥ యడిగోనుమాబావ పెదపెద్దస్వరముతో చదివే వేళాయెనులేరా ॥తెల్ల॥ మరదలుమరిజాణ మారాడనివ్వాదు

విరసూఁడు నామరదిలేరా సరకుశాయురువిన్న సరగూనబోవాలె వరలక్ష్మీపతి వేగలేరా ॥ తెల్ల॥ తోడికోడలు చెడ్డధూర్తురాల్దా నికి జాడదెలియరాదులేరా చాడీకోరుచిన్ని తోడికోడలు దాన్ని వాడుక దిరగాలిలేరా ॥ తెల్ల॥ మగడుదొడ్డవాడు వగలు జూచి నన్ను మిగులమన్ననజేయులేరా అగచాట్లువచ్చును యాలస్యమెందుకు తగవు రేపుజూపులేరా ॥ తెల్ల॥ నీవంటితన యూఁడు గావలెనని నేను గోరివచ్చితిస్వామిలేరా వేవేగ శెలవిచ్చి యింటికంపుచాలా భావాములోనుంచిలేరా ॥ తెల్ల॥ మునిపంట కెమ్మోవి మరిమారినొక్కేవు కనికరముంచియులేరా సరిసరి యనుచు నా స్తనయుగ్మమునని వరనఖములుంచేవు లేరా ॥ తెల్ల॥ గట్టిగకౌగిట బట్టివదలకున్నా విట్టులెందుకు ప్రేమలేరా పట్టువిడచినన్ను రట్టూలుబెట్టాకు దిట్టవురానాసామిలేరా॥ తెల్ల॥ మందగొల్లలంతా మరిలేచేవేళాయె యెందుకీమోహాములేరా తొందారచేతురు అందారువస్తేను మందారధరమొక్కలేరా ॥ తెల్ల॥ కోళ్లుగూయకముందే వేళకింటికిజేర్చిహాయిగానుంచుము లేరా వాలాయముగ చౌటపురియందునెలకొన్న వరదకేశవ రాయ లేరా ॥ తెల్ల॥ స్థిరభక్తుడైన అట్లూరి కూర్మరాయుడు వడిగవచ్చునేమొలేరా అలరూచు మీపాదపద్మముబట్టి మమ్మాల్లారిజేయునులేరా ॥ తెల్లవారవచ్చె॥

మేలుకొలుపు.

మేలుకొనుశ్రీ యాదికేశవ మేలుకొను శ్రీదేవివల్లభ
మేలుకొనుబ్రహ్మాండనాయక మేలుకొనవయ్యా స్వామీ ॥ మే॥

కోళ్లుగూసెను నలుకదీరెను కోమలాంగులు నిదురలేచెను
తెల్లనాయెను తేజమణగెను దీపములకిపుడూ స్వామీ ॥మే॥
జారెచుక్కలు నన్నిదిశలను చంద్రునకు కళలన్నిదరిగెను
వారకనుపద్మములు తేంట్లకు వరుసనిడెమధువూ స్వామి ॥మేలు॥
ఉదయశైలమునందుసూర్యుం డుదితుడాయెను తేజమొప్పగ
పదిలముగమీ సేవచేయను ప్రజలు వచ్చిరిగా స్వామీ ॥మేలు॥
ఆవలీవలపృథ్వినీళలు హస్తమున పన్నీరు బట్టుక
మీముఖప్రక్షాళనార్థము నిలచియుండిరిగా స్వామీ ॥మేలు॥
కరములను తంబురయువీణయు ఘనముగా ధరియించిపాడుచు
నారదుడుమరితుంబురుడును నాట్యమాడిరిదెస్వామీ ॥మేలు॥
సమ్మతంబుగ నమ్మియీపురమందుగల సన్మనుజులెల్లను
కమ్మికోనిమీ సేవజేయను నమ్మివచ్చితిరిగాస్వామీ ॥మేలు॥
వాసికెక్కిన చౌటపురిని వాసమునుజేయంగగోరియు
భాసురంబగువైభవంబుల వన్నెజూడవలెె స్వామీ ॥మేలు॥
ధరనుఅల్లూరికూర్మరాయుడు ధర్మమార్గము దప్పకను మి
మ్మరయదలచిప్రభాతముననిట కరుగుదెంచెనిదె స్వామీ॥మే॥

## మంగళహారతి.

బిలహరి—ఆట.

మంగాళమనిపాడరే యంగనలారా ॥మంగ॥
యంగజాజనకూనకూ దుస్సంగవర్జితూనాకు ॥మంగ॥
గళవిగ్రహునకు సర్వాంగసమనిలయూనాకు ॥మంగ॥

గోపరిపాలునకు గోవర్ధనధారునాకు
గోపకులసంతుష్టునకు గోపాలవేషునకు ॥మంగ॥
నందకుమారునకు నవనీతచోరునకు
నందకధరూనకు నవపద్మనేత్రునకు ॥మంగ॥
రుక్మిణీహృదయేశునాకు రుక్మిగర్వభంజనునకు
రాధమనోహరునాకు రాధేయుహంతకిప్రుడు ॥మంగ॥
ధరణిలట్లూరికూర్మా దాసునిసద్హృదయమందు
స్థిరముగా నెలకొనియున్న శ్రీరుక్మిణీశునాకు ॥మంగ॥

సురట—ఆది.

ఈశా నీకిదేమంగళం పరమేశా నీకిదేమంగళం॥
సోమేశా పార్వతీశా నీకిదేమంగళం॥

ఈశాకలుషవినాశానదహ్యాన్ని వేశా శ్రీపార్వతీశానీకిదే॥మంగ॥ హాసా చిదచిద్విలాసా త్రిపురవినాశా భక్తార్తిశోషా నీకిదె మంగళం॥ రాజా రవికోటితేజా శశిమౌళిరాజా అమృతరసభోజా నీకిదెమంగళం॥ హారీ వృషభవిహారీ సితవేణీధారీ శ్రీకంఠధారీ నీకిదెమంగళం॥ సూరీ వరమార్గచారీ వరభక్తోద్ధారీ భస్మాంగధారీ నీకిదెమంగళం॥ వాసా చౌటపురీశా శ్రీ కూర్మదాసా మానసవాసా నీకిదేమంగళం॥

జంఝూటి—ఆది

హారతిచేకొను సూరిజనావన
వారిధి గంభీర పరమదయాకర ॥హారతి॥

మేరుసుధీరా వారివిహార
కూరిమిచేకొను సారవిచార ॥హారతి॥

గోపరిపాలన పాపములెన్నక
కోపముసేయకు తాపసవరదా ॥హారతి॥

కప్పురహారతి ఒప్పుగజేకొని
చప్పనసేయకు గొప్పగజేయుము ॥హారతి॥

సత్యుడవీవని నృత్యముజేయుచు
హత్తుగశృతిగూర్చి నొత్తిలిపాడెద ॥హారతి॥

ధరణిలోచాటప ల్పురమున వెలసిన
వరశ్రీకేశవ పరమదయాకర ॥హారతి॥

స్థిరముగనట్లూరి కూర్మయదాసుని
కరుణనుబ్రోచిన వరలక్ష్మీపతి ॥హారతిచేకొను॥



ఓమ్

శ్లో॥ గురుర్ బ్రహ్మ గురోర్విష్ణుః । గురుర్దేవోమహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ । తస్మై శ్రీగురవే నమః॥

యీ శ్లోకార్థమే

# పరమగురు తత్వ విమర్శన చక్రము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | బ్రహ్మ | విష్ణువు | మహేశ్వరుడు | పరబ్రహ్మము | మూర్తి చతుష్టయము |
| 2 | తల్లి | తండ్రి | గురువు | దైవము | దైవచతుష్టయము |
| 3 | మంత్రము | మంత్రార్థము | మంత్రమూలము | మంత్ర సారము | మంత్రార్థ చతుష్టయము |
| 4 | సృష్టి | స్థితి | లయము | విదేహము | హేత్వార్థ చతుష్టయము |
| 5 | దేహము | సోహము | నేహము | నాస్తి | తత్వ చతుష్టయము |
| 6 | సాంఖ్యము | తారకము | అమనస్కము | పరిపూర్ణము | యోగ చతుష్టయము |
| 7 | ఆనందం | బ్రహ్మానందం | పరమానందం | రహితానందం | ఆనంద చతుష్టయము |
| 8 | భక్తి | జ్ఞానము | వైరాగ్యము | తత్వము | పావన చతుష్టయము |
| 9 | బాహ్యం | అనన్యం | ఏకాంతం | నిర్మలం | భక్త్యార్థ చతుష్టయము |
| | బ్రహ్మతత్వకదంబము | విష్ణుతత్వకదంబము | మహేశ్వరతత్వ కదంబము | పరబ్రహ్మకదంబము | ధాత్రీ తత్వములు |

# జ్ఞానయోగప్రకరణము

## తత్త్వములు

ఆనందభైరవి—అటతాళము

పరమేశ రక్షించుమా పాపవిభంగ పరమాత్మా కరుణించుమా॥ పరమేశ రక్షించు పామారుడను నన్ను కరుణాజూడకయున్న దరిజేర్చువారెవరు ॥పరమేశ॥ పాషాణమైయున్న పణతినిబ్రోచిన పరమాదయాకర పాలించు వేగమె ॥ప॥ యేశహస్తమువాడు ప్రకటముప్రార్థింప నాకాయుధమువాని వధియించిబ్రోచిన ॥ప॥ అచలాముగానుండి అన్నిటిక్షుద్బాపు వరపుత్రుశాసించి కరుణాసుతుగాచిన ॥ప॥ తోరాలగాచియు చిరాగపురికేగి బిరువక్రముదాని వెహాలబాపిన ॥ప॥ తాతభూపతిజేయ మాతూలదెగజూచి ఆతురతబాపి ప్రజకతి విభవమొసగిన ॥ప॥ బంగారుకాయుని శృంగారవధజేసి రంగూగ కురాని చంగూనబ్రోచిన ॥ప॥ కన్యామూయనివాని కెన్న ననుజూడవై యన్నశత్రునిలా సన్యాతిజేసిన॥ప॥ ధరచౌటపురియందు స్థిరముగవసియించి వరకూర్మారాయుని నిరతాము పాలించు ॥పరమేశ॥

శుద్ధకాంభోజి — ఆట

స్వప్రభ చేవెల్గు సర్వసాక్షినిగన వేరొకటుండునన్నా॥
తనకు తాన్వదోషము జెందునన్నా ॥స్వ॥
అందునాపరసౌఖ్యా మెపుడు జెందడు సర్వత్రవాడు క్రిందుమీాదు
తెలియలేక సందుసత్తెరుగాకాను ॥స్వ॥
పూర్ణుడౌనదాత్మను సంపూర్ణుడై శోధించకున్నా
పారమార్థిక మెట్లనందగు పరమపద మెటుదెలియనౌను ॥స్వ॥
సద్గురుప్రభుకరుణ వెలయ సర్వసాక్షి ప్రభ నెరిగి
నిర్గుణావై రాగిగాక నిర్మలత్వంబెటులగల్గు ॥స్వ॥
తన్ను తానుగనక నీవే సున్నయామాయాను జెంది
మెన్నిపోకలుపోయినా నా సన్నతోవే మిన్నయౌను ॥స్వ॥
అణుస్వరూపమై యానంతరూపమైనవాని
ప్రణుతి సేయాగలేని పామరత్వము జెందిచెంది ॥స్వ॥
అబ్బురాముగాను శ్రీ సుబ్బరాయగురునికృపను
గొబ్బునా శ్రీకూర్మరాయుడు నిబ్బరముగాగన్న
పూర్ణము ॥స్వప్రభ॥

పూరిరాగం — ఆది

నారాయణునీ నామాక్షరములు నమ్మిపఠించవె మానసమా
నారాయణ యనుచతురాక్షరినివు కోరిభజించవె మానసమా॥
ఓంనమోనారాయణ యనుమంత్రము వనరుదెలియవే మాన
సమా! మన్ననతో హరినారాయణయను మాటవిడువకే మాన
సమా ॥నారా॥ ఓంనమోభగవతేనారాయణయను వర్ణములర

యవె మానసమా తన్నుమరచినారాయణనామము తలచు
చునుండవె మానసమా ॥నా॥ అక్షయమగు దేహత్రియంబు
లకు సాక్షిగదెలియవె మానసమా లక్ష్మీనాథుని లక్షణగుణ
ములు లక్ష్యమునుంచవె మానసమా ॥నా॥ అల సచరాచర
లోకంబంతయు హరియనితలచవె మానసమా నాల్గువేదములు
నలువరుద్రిదును నారాయణుడే మానసమా ॥నా॥ అన్నిజగం
బులకాధారంబై యలరుచునున్నదె మానసమా పన్నుగనాపో
జ్యోతిరూపమై తిన్నగవెలుగునె మానసమా॥నా॥ భాసురభార
ద్వాజాన్వయులౌ దేశికరంగార్యులె మానసమా వాసిగకూర్తా
యునిమాటల దోసమేదిగనుగొను మానసమా ॥నా॥

రేగుప్తి—ఆది

నమశ్శివాయనవే మనసా ఓం నమశ్శివాయనవే॥
నమశ్శివాయని నమ్మిభజించిన
సమస్తసుఖములు ఘనంబుగను జేరు ॥నమ॥
స్థిరంబుగను పరమొసంగగలడని
కరంబుగను నాల్గవస్థలందున ॥నమ॥
శంభోహరయని జపించువారికి
లభించుమోక్షము హరించుభవములు ॥నమ॥
భజించువారల భయంబువాప్రను
నిజంబు జపమున నిలకడగల్గును ॥నమ॥
సాంబసదాశివ సర్వేశ్వరయని
దంభముబాసిన ధర్మవిదుండగు ॥నమ॥

జ్ఞానయోగ ప్రకరణము

పార్వతీశ పద్మాక్షమిత్రియని
పలుమరునీలో ప్రస్తుతిజేయుచు -నమ-
ధరనుచౌటపల్ పురమున వెలసిన
వరసోమేశ్వర వరదాయకయని -నమ-
కరుణనుఅట్లూరి కూర్మారాయుని
నిరతముబ్రోచే నీలగళుని ఓం -నమ-

శహాన—ఆదితాళము.

రామునిమించిన వేరొకదైవము భూమిలోలేదునుమీ॥
ఆత్మారామునిమించిన వేరొకదైవము భూమిలోలేదునుమీ॥
రామరామరామాయనుజనులకు రమ్యమైనదా రదేనుమీ
అగసుతయెల్లపుడానందముగా ఆత్మనుమరువని దదేనుమీ॥రా॥
రామదాసురారమ్మనివేడగ కామములొసగిన దదేనుమీ
వాల్మీకాదిమహాఋషులకునెల్లను వైభవమొసగిన దదేనుమీ
॥రాముని॥

జనకజాదిమహారాజులకెల్లను జన్మపావనం బదేనుమీ
ప్రహ్లాదాదిభక్తవరుల కాహ్లాదంబొసగిన దదేనుమీ ॥రా॥
వాసిగచౌటపురినివసించియు దాసులబ్రోచిన దదేనుమీ
భాసురముగసచరాచరంబులకు ప్రభువనదగినది యదేనుమీ
॥రా॥

స్థిరముగమద్దురుసుబ్బరాయ హృద్భరితంబైనది అదేనుమీ
ధరణిలోకూర్మారాయదాసునికి నిరతముపోషణ యదేనుమీ
॥రాముని॥

పూరికల్యాణి—అట

భ్రష్టుపనులేలా వినుజెష్టమనసా ఛీ కష్టపడుటేలనో ముష్టి
మనసా॥

కష్టానరులానుగూడి నిష్టాజెడిపాలువాలి
అష్టాక్షరిమంత్రమేపట్ల జపియించకను ॥భ్రష్టు॥
పామారులనుగూడి పలువాదమేలను
పంచాక్షరిమంత్రము పఠియించు పఠియించు ॥భ్ర॥

నిశ్చలముగానీవు నిర్మలాత్మనుగూడి
స్వచ్ఛమైవెల్గు గురుమూర్తి నేమారకు ॥భ్ర॥
అందముగాను పర నిందజేయుటమేల
నందనందను మది నమ్మిభజియించకను ॥భ్ర॥
ఆకలికోర్వని నూకరాదులవలె
శోకమాలముదిని చీకాకుబడనేల ॥భ్ర॥

క్రోధమానసులను సాధులనినమ్మినీవు
బోధజెందక మధుసూదానునినమ్మమిల ॥భ్ర॥
నిబ్బారముగాను మా సుబ్బారాజగురునిజేరి
గొబ్బునను మొక్కి వేడ కబ్బమిచ్చిబోధించువిను ॥భ్ర॥
పట్టువదలకసిల అట్లూరికూర్మరాయు
డిట్లుప్రార్థనజేయ గట్టిగానునమ్మామవిను ॥భ్రష్టు॥

## జ్ఞానయోగ ప్రకరణము

### నాదనామక్రియ—అట.

ఆడదానినిగూడవలయునురా మూఢాత్మనీలో ॥ఆడదానిని
గూడవలయునురా॥

ఆడదానిని గూడకను నీవేడ కేగినముక్తి దొరుకదు
ఆడఈడఏడజూడ ఈడుగాదు దానితో సరి ॥ఆడ॥
ఒంటి స్తంభము మేడలోపల దంటదీరియున్నదదిగో
కంటికీగనుపించు వాలుగంటినీ యెడబాయకనునీ ॥వాడ॥
చందమామపట్నమందున పొందుగాఅద్దముల మేడలో
చందనాగంధికిఅందెలు అందముగపదిగతులమ్రోయును ॥ఆడ॥
ముక్కునాముంగేరయున్నది ఒక్కవజ్రపుతళుకుయున్నది
చొక్కపుముత్యముయున్నది చక్కనియామోహనాంగికి ॥ఆ॥
మూటిలోగానున్నదదియిరు మూటినిమీరున్నది
మూటిమూటిదాటియావల బాటలోనిలుచున్నదదిగో ॥ఆడ॥
నీలతోయదమధ్యమందున హాయిగానివసించియున్న
మేలుశోభనాంగికెప్పుడు కీలుదెలసిజోడువీడక ॥ఆడ॥
ముమ్మూలకోనలోపల మూలమైనభాసురాంగిని
నెమ్మనంబున దరచిదరచి సమ్ముదంబునజోడుబాయక ॥ఆడ॥
ధరనుసుబ్బారాజసద్గురు కరుణాకిరవై యున్నదదియే
అరసికూర్మారాయుడెపుడేమరక స్థిరమైయున్నదదిగో ॥ఆడ॥

### కన్నడ—అట.

అతిరహస్యముబట్టబయలని అందరుబల్కెదరు
జనులందరూబల్కెదరు నరులందరుబల్కెదరు
దానర్థమేమోదెలియలేకను వ్యర్థులైచెడిపోదురు ॥అతి॥

ఆదిఅంత్యము లేనిదానికి పాదుయున్నదనందురు
ఆదియైనదానిదెలియక యంధులై చెడిపోదురు ॥అతి॥
పూర్ణభావముదెలియకనుపరి పూర్ణులము మేమందురు
పూర్ణశుంఠలువారుభువిలో పుట్టిగిట్టుచునుందురు ॥అతి॥
సర్వశేషప్రసాదమేదో సార్థముగగనజాలరు
కర్మశేషప్రసాదముల దుష్కర్ములై యిలబడుదురు ॥అతి॥
మూలమైనప్రసాదమెరిగి ముక్తిని గననేరరు
మలత్రియసేవాధికారులు మలినజన్మల బడుదురు ॥అతి॥
ఇలమహావాక్యముల నాల్గిటివిధము గనుగొననేరరు
యెల్లమోహాంధమున జిక్కి వెర్రులై చెడిపోదురు ॥అతి॥
ధరనుసుబ్బారాజసద్గురు కరుణగాంచగనేరరు
పరమెరుంగకపామరముచే భ్రష్టులైచెడిపోదురు ॥అతి॥
వాసిగా శ్రీకూర్మరాయుని వాక్యసరణి నెరుంగరు
గాసిజెందుచు కర్మములచే కలవరించుచునుందురు ॥అతి॥

సావేరి—అట

అయ్యయ్యో నరజన్మ మమరినందుకు ఫలము ఆత్మను దెలియ
వలెగా పరమాత్మనుదెలియవలెగా ॥అయ్య॥
చయ్యాన పరధనముపై కూర్మిగలిగితా
నెయ్యాముగను నుండనేరకా విఫలతా ॥అయ్య॥
పురుషాజన్మమెత్తి పురుహూతాదులుమెచ్చ
పరస్త్రీసంగమే మాని ఫలమేదోదెలియక ॥అయ్య॥

స్త్రీజన్మ మొందియాశ్రితగృహధర్మము
ఆజన్మాంతము పరు నంటక విహరింప ॥కయ్యో॥
పూర్వఫలముచేత పురుషార్థమౌజన్మ
సర్వోత్తమంబైన సరణిగాంచగలేక ॥అయ్యో॥
మూటియనుభవము తా మేటిగా శోధించి
బాటాదెలియుమిహ బూటకములుమాని ॥అయ్యో॥
సారాములేని సంసారాబ్ధిమునుగక
కోరి త్రివేణిని జేరి మునుగగలేక ॥అయ్యో॥
వెరువాకసర్వాము పరమానిదెలసినా
నరులాకు నిహమాని తెరదియ్యనేరక ॥అయ్యో॥
చక్కగా పరమబ్బై సన్మార్గమెరుగాకా
కుక్కపనులు జేయు కుజనూల జేరకా ॥అయ్యో॥
గొబ్బున మద్దురు సుబ్బరాయునిగొల్చి
నిబ్బరముగ పర మబ్బెమార్గము దెలియ ॥కయ్యో॥
దాసుడౌశ్రీకమఠ రాయునివాక్యముల్
దోసము ల్వదలించి ఈశునిజేర్చును ॥అయ్యయ్యో॥

శ్రీరాగం—ఆది.

తప్పులెంచేఅయ్యలారా చెప్పుడీదీనర్థము,
చెప్పలేకున్నానయిపుడే తప్పనితలవాల్చుడి ॥త॥
ఇంటివెనుకా యేడుకొండల దొంతినిలచిందేమిరా,
కొండదొంతరమీదకోడి కూతవేసినదేమిరా ॥త॥

మూడుకాల్వలు యేకమైన ముఖ్యస్థానం బేదిరా
మూటికవ్వల నిలచిచూచే మునలిదెవ్వరో చెప్పరా ॥త॥
నాల్గుకంగుల కనల వెల్గే నాతియెవరో తెల్పరా
నాల్గుపైగా నాతిమీద జోతివున్న దేమిరా ॥త॥
శుద్ధస్ఫటికము మధ్యనొక్కహద్దుయున్న దదేమిరా
సద్దులేకను మధ్యగనుగొన ముద్దులయ్యో రేమిరా ॥త॥
కాకిమూకలు గుమియుగూడి చికాకుజేయున దేమిరా
నక్కలోన కుక్కయొకటి నిక్కచూచు నదేమిరా ॥త॥
వాసియాశ్రీసుబ్బయార్యు బాసిదెలియరాదురా
భాసురంబుగకూర్మరాయుడు దోసిలొగ్గియడిగెరా ॥తప్పులెంచే॥

శ్రీరాగం—ఆది.

ఆనందమానందమాయెను బ్రహ్మానందమానందమాయెను నిత్యానంద యోగానంద పరమానంద సచ్చిదానంద మానందమాయెను॥ ఆనందమునమాయ తానెందువిల్వక మహానంద మానందమాయెను॥ పార్వతిమనోహరమాయెను రామనామము మినహాలేదాయెను అందుయిందనకను యెందు జూచినవేరు సందేమిలేకను సర్వంతానై ॥నిత్యా॥ నూదియైన మోపగరాదాయెను యదియాదియంత్యములేనిదాయెను పాదు గనగబోవ పరమాత్మరూపమై యేదిజూచినలోన వెలుపల తానై ॥నిత్యా॥ దివియు నిశియు లేనిదాయెను అది యేవేళజూడ బయలాయెను యంతటతా సూత్రధారియైతిరుగుచూ వింతమై తాబొమ్మలాటయెజూడ ॥నిత్యా॥ ఎందుజూచినాను యందము

దాని సంధిగురుగోప్యమై పొందదు యందరిలో నది యానంద రూపమై పొందూగ మూ డవస్థలులేకయుండు ॥స॥ వినవినగా నడత గల్గును దాన్ని కనగ కనగ నాదివెల్గును సోహం సోహంబనే సూటినీదెలసిన యహంభావములేక యంతటతానై ॥సదా॥ ధరను సుబ్బరాజదేశిక వర చరణాబ్జ యుగ్మపూజజేసుక దరచ దరచ సర్వతత్వాతీతమునునై పరగజన్మకర్మ పరిత్యాగమైన ॥సదా॥ గురుపూజయానందమాయెను రామ గురులాకు నైక్యాముజూపెను ధరను శ్రీకూర్మరాయ దాసవాక్కులె మనకు పరమునొందుటకు బట్టబయలాయె ॥పరమానంద॥

బిలహరి—ఆది

నామనవి వినుమా మానసానీవు నామనవి వినుమా॥ నామనవి వినుమా నీకేమి కొరతరాదు స్వామిసన్నిధిజేరే దారి చూపెదనీకు ॥నా॥ పంచశరుడనెడు చెంచువాడు పశులౌమను జులను మించిమోహములాను మంచివలలను వేసి పొంచిగూ ర్చుండి తా మంచిగ బంధించు॥నా॥ మూతత్రిపురీషాములచేనున్న గాత్రము గనక వింతైనమద మోహ భ్రాంతిలోమునుగాకా సంతకూటమియని స్వాంతమందున నమ్మి ॥నా॥ నాహంకర్త నుచు సోహం మరచినేభర్తననుచు నేహం నాస్తియను నిజమార్గ మెరుగాకా యహంభావముచేత నమరియుండకుఛీఛీ ॥నామన॥ కపటము దూరి వెదుకుమికసఫలమాదారి నెపములెన్నక గురు కృపయేసదాగోరి ఉపమానరహితమా కపటనాటకుమీరు ॥నామనవి॥ సుజ్ఞానిగాక గానగలే వీ వజ్ఞానమీాక ప్రజ్ఞానం



9

బ్రహ్మని పలుకుశ్రుత్యర్థము విజ్ఞానదృష్టిచే వీక్షింపనీవౌదు ॥నా॥ ఊహచేజూడు నీలో నీవా పోహణనేడు యూహాంబ్రి హ్మాస్మియను యనుభవముదెల్పెద యూహాపోహాలులేని యున్నతమొందెదవు॥నా॥ సత్యమిదివినుమానిర్మలమైనయాన్న త్యము గనుమా తత్వమసీయనుతాత్పర్య మిదిగను నిత్యామై వెల్గు పరవస్తువౌదువీవు ॥నామనవి॥ హాయిగానుండు సద్గురు నెడబాయకయుండూ అయమాత్మాబ్రహ్మను యామర్మ మెరిగింతు భయరహితంబైన భావమె నీవౌదు ॥నా॥ సందు లేకుండూ సద్గురు నాజ్ఞా సమతగమెండూ పదియారక్షరముల పద్ధతినీవేను ద్వంద్వాతీతమైన ద్వాదశియదిగోను ॥నామనవి॥ పంచగాచుండూ వంచనలేక మంచిగానిండూ పంచదశాక్షరి పద్ధతియిదియెల్ల సంచితమెడలి నీవు సంతానమందుదువు ॥నా॥ సుబ్బరాద్గురుని సూచనకూర్మారాయదాసూని॥ అబ్బబోదు సుమ్మి హరిహరాయజులకు తబ్బిబ్బుపడబోకు దైవమల్లదె సుమ్మి ॥నామనవి వినుమా॥

మలయమారుతం—ఆట

మొదలుమీదుగకొనలుక్రిందుగ మొలచియున్నది వృక్షము-
ఆదియేమో దెలియను యసాధ్యమైమిగులున్నది ॥మొ॥
ఏకమార్గముచేతనుబల్ జోకగా వృద్ధౌనిది
పాకటంబుగరెంటిచేదీని బాట బయలైయున్నది ॥మొ॥
తొర్రలుతొమ్మిదిగల్గి విరపీగుచున్నది
యిరులుమూడింటిచేబహు బిరుగ్గా తానున్నది ॥మొ॥

శతుృలార్గురిగానలేకను వృత్తి యిదియనుకున్నది
మిత్తివచ్చి పైనబడగా మొత్తుకోలేకున్నది ॥మొ॥
నల్లగుంటనట్టనడుమను తెల్లతామరయున్నది
కల్లగాదు దానిమధ్యను కన్యయొక్క తెయున్నది ॥మొ॥
ఎరుకమరపులులేక తానొక తెరవుదాన నన్నది
గురుకరుణబొందినవారల గూడియుండేచిన్నది ॥మొ॥
పృణవరవమునగూడిచనియే బాటజూచుచున్నది
ఘణఘణధ్వనులాచెవారల గలసిమెలసేనన్నది ॥మొ॥
గురునికన్నను పరములేదని వరశృతులలో నున్నది
పరముదెల్పును సుబ్బరాడ్గురు భావమం దిదియున్నది ॥మొ॥
వేషభాషలులేక కూర్మారాయుడు తా గన్నది
శేషఫణులయందుశ్రీనివాసుడై తానున్నది ॥మొదలుమీాదుగ॥

దర్బారు—ఆట

మానసమా నీవుమరువాకుమీా గురునిపాదపద్మములను విడువాకుమీా సారాములేని సంసారాబ్ధిలో జిక్కి సారాము లేని జన్మాదులదగులకు॥ గురునినివాసమెదుకావలెం శ్రీ గురు మంత్రమేవేళ దలచావలెౕ పరముజేరేదారి పరిపరివిధములస్థిరముగ బుద్ధిని నిలుపవలెౕ ॥మా॥సరసీజములజాడ వెదుకావలెౕ మేరుశిఖరముపై కుదురుచేరవలెౕ సారెసారెకు నీవు సమరసమెరిగియుసారాము లేనియాపరిపూర్ణమెరుగుటకు॥మా॥మల్లెమొల్లల పూజ జేయవలెౕ యుల్లాములోనమ్మియుండావలెౕ కల్లగాదు వానికరుణావడసినీవు ఫుల్లాబ్జదళనేతృపొందావలెౕ ॥మా॥

వరసుబ్బయార్యుని వదలాకుమీ నీ కరయశక్యముగాని దండు
సుమీ ధరనుకూర్మరాయ దాసునివాక్యము లరసి నిత్యానంద
మందుటకును సదా॥ మానసమా నీవు మరువాకుమీ॥

కమాచి—అట

గురురహస్యము దెలియుటకు సద్గురునికరుణయు గోరుమీ
పరమపావనమైన శ్రీగురుపాదములు భజియించుమీ ॥గు॥
అరమరేమియులేక సద్గురు నిరతమును ప్రార్థించుమీ
గురుతుగా సర్వార్థములకును పరముయేదో దెలియుమీ ॥గు॥
సాధనలనాల్గింటి ముందుగ స్వాదుగా గ్రహియించుమీ
వాదభేదముమాని ఖేదములేనిసద్గతి గాంచుమీ ॥గు॥
వేదములనాల్గింటిలోగల భేదమేమోదెలియుమీ
పాదుదెలసి నాల్గుపదముల భావమును వివరింపుమీ ॥గు॥
ఆర్యకృపహరిహరులనిర్మల సారమేమోదెలియుమీ
పారమౌసంసారసాగర పారమేగురిగాంచుమీ ॥గు॥
తత్త్వమసి యనువాక్యమైక్యము తృప్తిగా గురిగాంచుమీ
ఆత్మపరమాత్మైక్యసరణికి అంత్యదశ యోచించుమీ ॥గు॥
షోడశాక్షరిమూలమేమో జాడగురుకృపదెలియుమీ
ద్వాదశాక్షరిమంత్రిమహిమను పాదుదెలసి జూడుమీ ॥గు॥
ధరనుకోమరోల్సుబ్బరాద్గురు పరమమహిమనుగాంచుమీ
భాసురంబుగకూర్మదాసుని వాసియేమో దెలియుమీ -గురు-

ఆనంద భైరవి—ఆది

కొట్టరా ఘంటా గొట్టరా ఘణంఘణాంయన ॥గొట్టరా॥
కొట్టరా పదునాల్గుభువనము లెట్లుచూచినానుబ్రహ్మము
బట్టబయలై యెరుకరూపా మట్టుగా ప్రపంచమానని ॥కొ॥
ఉత్తదీజగమనెడువాక్యము నిత్యమనిమదినమ్మకను యీ
జ్ఞప్తిలేకనుసత్పదార్థము నిత్యముగప్రత్యక్షమానని ॥కొ॥
కర్మజన్మలదొలగజేయును నిర్మలంబౌనాత్మజ్ఞప్తిని
మర్మమేమియులేనివెలుగున ధర్మగుప్తముచూపు నిజమని ॥కొ॥
పారమెందూలేనిబ్రహ్మము సారరహితమైన యెరుకను
దూరుజేసికార్యకారణ దోషరహితమైనదదియని ॥కొ॥
నారసీరముకారములకాధారమా శ్రీకారమిదియని
భారమేమియులేక సర్వసాక్షిరూపమైనదదియని ॥కొ॥
మాటిమాటికికోటివిద్యలు నాటకాలంకారమనుచును
చాటులేకను పరబ్రహ్మము నాటియున్నదంతనిజమని ॥కొ॥
అంచితంబుగసర్వభ్రమలను కొంచెమైననువుంచుకొనకను
సంచితాప్రారబ్ధములను మించియున్నది పరమపదమని ॥కొ॥
పొందుగామాసుబ్బయార్యుల కందమూగా సేవజేసి
యందియున్నకూర్మరాయున కెందునా సంశయములేదని ॥కొ॥

ఆనంద భైరవి—ఆది.

రామరామయనుమీ శ్రీ రామాయనిమనుమీ॥
కామమోహములకదలనివ్వకను సామజవరదుడె సర్వాత్ముం
డని ॥రామ॥ సత్యంబిదివినుమీ అంతా నిత్యంబనికనుమీ

సత్యాసత్యము నిత్యానిత్యము వ్యక్తిలేనిపరమాత్మయెయిది యని ॥రా॥ నారాయణయనుమీ సర్వం పారాయణ కనుమీ నారాయణాత్పరోర్నాస్తియనుచును సారరహితసంసారమన్నృత మని ॥రా॥ తథ్యంబిదియనుమీ యిదియే పథ్యం బిది వినుమీ బద్ధరహితపరమాత్మయె నిజమని శుద్ధబ్రహ్మం నూటిదెలుసు కొని ॥రా॥ సురుచిరమతిగనుమీ రామాత్పరమికనాస్తియని కరమనుదుగ శ్రీసుబ్బయార్యులిది వరకూర్మయదాసున కెరి గించెను ॥రామరామయనుమీ॥

పూరికల్యాణి—ఆది.

ఎన్నివిధములానునిను మన్ననజేసెదను
కన్నెవయసుదాన తను వన్నెగుల్కుచాన -ఎన్ని-
ఏడుమేడలందు కడమేడనుండుదాన
జాడదెలసిచూడ వడిదాపుచేరవేలా ॥ఎన్ని॥
మోముచక్కదనము పూర్ణసోమునినిరసించు
భామచూడ్కిగములు సమవారిదములబారు ॥ఎన్ని॥
పంచరంగులను హాయిల్మించుమేడలోను
అంచితముగనీవు బల్వొంచియుండెదావు ॥ఎన్ని॥
కోటిసూర్యకాంతి సరిబోలునార యింతి
వాటముగా నిన్ను బల్నీటుగ బట్టెదను ॥ఎన్ని॥
సారసాక్షి రావే సరి మేరమీరిచేరె
వారిమధ్యమమున వయ్యారినన్నుగూడె ॥ఎన్ని॥

కాళ్లగజ్జలరవము వినగానె తనువుమరతుగా
లేళ్లగంతు లేలా వేసెదవు మళ్లీనిలువు ॥ఎన్ని॥
పొందగోరినాను యిదె సందుగురునితోను
అందెకూర్మరాయ నానందవార్ధిముంప ॥ఎన్నివిధము॥



## ముక్తికాంత తలుపుపాట

నాదనామక్రియ — ఆది.

ముక్తికాంత నేమురయుచు వస్తిని తలుపుదీయవే భామా
నాతలపు లీయవేభామా॥
నీవెవ్వరవో తెలియదు నాతో నిజముగపనులేమోయి
నీకు నాతో పనులేమోయి॥
శ్రీమ తొ్కుమరోల్సుబ్బరాజగురు ప్రియశిష్యుడనేభామా
నేగురుశిష్యుడనే లేమా॥
గురుశిష్యుడ వీ వై తేతిరిగి రాజమార్గమున రమ్మా
పో రాజమార్గమునరమ్మా॥
రాజమార్గమది యేమో తెలియగ రాజలలామరో జెప్పవే
ఓ రాజలలామరో చెప్పవే॥
నల్గురుమంత్రులుకూడిన స్థలమేదో నాతోదెల్ప గదోయి
నీవు నాతోదెల్పగదోయి॥
అంతరిక్షపంచకమేయదియని యార్యులుజెప్పగవింటి
వారి కృపచే దెలసుకొంటి॥

అనిలసమిష్టిక మేదోదెలియగ వినవలెనొచ్చెగదోయి
యది వినవలెనొచ్చె గదోయి॥
వ్యాన సమానో దాన ప్రాణా పానములందురె మగువా
పంచప్రాణము లవియే మగువా॥
అనలపంచకంబన నదియేదో వినవలెనొచ్చె గదోయి
యదివినవలె నొచ్చె గదోయి॥
శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లివియే గదవో చెలియా
యవియేస్థిరమో మగువా॥
తోయపంచకంబనగా నేదో హాయిగ గనిరావోయి
బల్ హాయిగ గనిరావోయి॥
శబ్దం బాదిగ గంధాంతంబని పెద్దలవాక్యమె లలనా
అది పెద్దలవాక్యమె చెలియా॥
కర్మేంద్రియపంచకమన నేదో కడ తెలిసి తెరావోయి
యాకడదెలసి తె రావోయి॥
వాక్కుమొదలుగా పాయ్వంతంబని వాకు వ్వగనే వింటీ
సద్గురులద్వారా వింటీ॥
స్థూలంబేమో మూలముదెలిసి తె జాలుగ నివు రావోయి
సమ్మేళము గనిరావోయి॥
ఐ దైదుల సమ్మేళనసమయము యదియే యదియనియుంటీ
నేనదియే యదియని యుంటీ॥
సూక్ష్మంబేదో సూటిదెలసుకొని సూత్రముగని రావోయి
యాసూత్రము గనిరావోయి॥

ప్రభువును తైజస నాముడు చారులు పదియార్గురు యుండే దే
యది పదియార్గురు యుండే దే॥
కారణమనగా దానికి యెవరో కనుగొనియిటురావోయి
వాని గనుగొనియిటురావోయి॥
ప్రాజ్ఞుండనియే ప్రభువునివాసము ప్రబలెడిదదియే చెలియా
బహుప్రభగల దదియే లలానా॥
అటులై తేమరి యారుద్వారములు యడ్డుజేసిరావోయి
నీవడ్డులేక రావోయి॥
నిర్గుణముగనడ్డగించి నాలో నిర్మలకళలనుజూస్తి
లో నిర్మలకళలను జూస్తి॥
సూక్ష్మముగా నతిఘనమైయుండే ధ్వానులనువింటి వటోయి
దశధ్వానులను వింటివటోయి॥
చిణిమృదంగ ఘనవేణునాదములు చిత్రముగానేవింటీ
బల్ చిత్రముగా నేవింటీ॥
మురళీధ్వానులను మురయుచు వినగా ముందుండే దేమోయి
యాముందుండే దేమోయి॥
ఘంటారవమిని కాంతులు జూడగ కామంబిది కడతేరే
నిష్కామత్వము చేకూరే॥
శంఖారావము చెలగుచువినగా శంకలునీకేమోయి
కుశ్శంకలునీకేలోయి॥
భేరివాద్యమటు ఫెళఫెళమనగను బ్రహ్మపదంబై తోచె
పరబ్రహ్మపదంబేతోచే॥

ఈషణత్రియమను ఈశ్వర్యముదెలసితే యింపుగనివు రావోయి
బల్ సొంపుగానురావోయి॥
దారాదులపై మోహము-ఈషణ త్రియమనిదెలసెనెభామా
యదివ్రియమనిదలచెదలేమా॥
వీటినన్నిటినిపవరముదెలిసిన నీవెవ్వరవో చెప్పుమా
మరినీవెవ్వరవో చెప్పుమా॥
జీవభావమున నేనని వస్తిని నీదరిజేర్చుమి కాంతా
ననునీదరిజేర్చుమి కాంతా॥
అకార ఉకార మకారముల కాధారం బేదో చెప్పుమా
దానిమూలంబేదో కనుమా॥
ప్రణవమె యాధారం బనినే సుజ్ఞానులుదెల్పగవింటీ
యజ్ఞానము విడినేనుంటీ॥
సత్వరజస్తమ గుణనగునాతో స్నేహమునీకేమోయి
నాస్నేహమేమి ఫలమోయి॥
ముమ్మూర్తులకు నూల్మలమునీవని మురియుచు వస్తినిచెలియా
నే మురియుచువస్తినిమగువా॥
హంసాక్షర మంత్రం బననేదో యంతుదెలసి రావోయి
యానంధిదెలసి రావోయి॥
ఓం హ్రీం శ్రీం హంసంబును గూర్చితే పరమసుఖంబని వింటీ
నే పరసౌఖ్యంబనియుంటీ॥
లక్ష్యముదగ్రి యనగానదియేదో లక్ష్యముగా నివుజూడు
యంతర్లక్ష్యం బెట్లోచూడు॥

అంతర్వీధిని దృక్కునిలచితె యింతని దెల్పను వశమా
యింతింతని దెలియను వశమా॥
ముక్తిద్వారంబేదో దెలసుక ముదముగ నివు రావోయి
సమ్మోదమున నివు రావోయి॥
పున్నమిని మార్గం బదియని యార్యులు ప్రేమతో దెల్పగవింటి
సత్కృపచే జూచియుంటీ॥
అచల బ్రహ్మము వాక్కున మనసున గోచరించి నివు బల్కు
దృగ్గోచర మేమో దెల్పు॥
నిత్యంబై వెలుగొందువస్తువున ననిత్యము లెటువలెజూచు
సాన్నిధ్యము లెటువలెతోచు॥
ఆపోజ్యోతిరసోమృతమని యెడి శృతి మేనీవనిజూడు
యాశృత్యర్థము నేగూడు॥
ఆపోజ్యోతులజూడక బ్రహ్మము యావలజూచే దేవీ
యవిగాకనుజూడమ రేవీ॥
ప్రజ్ఞానంబ్రహ్మనుఋగ్వేదము పలుకునువింటివటోయి
దానిభావముగంటివటోయి॥
అహంబ్రహ్మమను యజుషియందు రెండనుభవమేఓభామా
యస్మదార్యులబోధిదిలేమా॥
తత్వమసీయను వేదవాక్యమున కర్థము తెలుసునటోయి
నమ్మర్థముగనిరావోయి॥
అయమాత్మబ్రహ్మంబునుగూర్చియుయార్యులుచెప్పిరిభామా
యస్మదార్యులబోధదిలేమా॥

సర్వంఖల్విద బ్రహ్మంబను శృతి కర్థముగనిరావోయి
పరమార్థముగనిరావోయి॥
కించిన్నెహనానాస్తియనుగురువాక్యము బయలైతోచే
యదిబయలులో బయలైతోచే॥
షోడశాక్షరీమంత్రమదేదో యోడకదెల్పగదోయి
దీనిజాడదెలసిరావోయి॥
మొదలులేసిగుర్తిరుగుశరీరమ్మేదీలేదనితోచే
మరితానేలేదనితోచే॥
ద్వాదశాక్షరీమంత్రమదేదో పాదుదెలసిరావోయి
యిదిసాదుజేసిరావోయి॥
రిక్తబట్టబయలేమీలేదని నిశ్చయమున నేనుంటి
యతినిర్మలముగ నేనుంటి
కలలోదోచిన కలశరీరములవలెనే కల్లనితోచే
మేల్కాలయేయిదియనితోచే॥
శేషశయనుడై శ్రీపతియుండే స్థలమునుజూచితె రమ్మా
యచ్చోటను నుందుము రమ్మా॥
శేషశాయిసహస్రముకావల బాటబట్టియున్నాడే
నిశ్శబ్దముగానున్నాడే॥
మూడుయారువర్ణములునుగూడిన మేడలోకిరావోయి
యాజాడదెలసిరావోయి॥
నిరాకారమా నిర్గుణబ్రహ్మము నీవే నేననిజూడు
ననునిన్నెగామరి జూడూ

నానీభేదము నీరులవణమని నిశ్చయముగగనుమోయి
యదినిశ్చయముగగనుమోయి॥
నీనాభేదముకర్పురదీపపు కళలవలెనెతానుండు
నిష్కళయైలేకనుయుండు॥
సాంఖ్యతారకామనస్కంబులు చక్కగదెల్పిన దెవరు
యీసాంతముదెలిపిదెవరు॥
సాంఖ్యమాదిపరిపూర్ణాచలములు సాంతముజేసెనెగురుడూ
యీసాంతముచేసెనె గురూడు॥
అన్నింటనునీవనుభవజ్ఞుడవు సన్మతియేరావోయి
ననునెమ్మదిగూడుండోయి॥
ఈసంవాదముబాడిన విన్నను ఈశ్వరుడిచ్చునుమోక్షం
పరమేశ్వరుడిచ్చునుమోక్షం॥
వ్రాసినవారికిసంకల్పము లనివార్యముగా హరి యిచ్చుక్
సత్కృపచే హరిపురి జేర్చుక్॥
అట్లూరికూర్మారాయుడు స్వస్థితి యనుభవమిదియనిదెల్పెక్
పరమాశ్రితమతి నటునిల్పెక్॥

ఓమ్, తత్, సత్.

శహాన—అది.

ఎంతోమంచిగురుడే యిహ చింతలన్నిదీర్చెనే ॥ఎం॥
చింతాలనెడజేసెనే నిశ్చింతలోననిల్పెనే ॥ఎం॥
వంతాముతోడుతముక్తి కాంతానుజూపింతునాని
నంతోషముగపదపద్మముల సన్నిధినిజేర్చెనే ॥ఎం॥

మస్తాకమునహస్తమునిచి స్వస్థితిజూపించేనే
హస్తామస్తకసంయోగమున యజ్ఞానాంధముబాపేనే ॥ఎం॥
సాధనలనాల్గింటిముందు బోధజేసిజూపేనే
పాదుదెల్పిపరమార్థముకు సాధనిదియనిబల్కేనే ॥ఎం॥
చెంతజేర్చిగురుధర్మముల యంతుజూపిబ్రోచేనే
యింతవారనిదెల్పుటకునే నెంతవాడనుమ్రొక్కెద ॥ఎం॥
ప్రజ్ఞానంబ్రహ్మనిదెల్పి సుజ్ఞానిగాజేసేనే
ధీజ్ఞప్తియాహంబ్రహ్మయను ధీరాతనేనుంటిని ॥ఎం॥
తత్త్వమసియనుబోధచే కుయుక్తులనువదలించెనే
హత్త్రితిఅయమాత్మబ్రహ్మ యాసలన్నివీడేనే ॥ఎంత॥
షోడశాక్షరిభావామున శోధనాబయలాయెనే
వేడుకతోద్వాదశాక్షరి వెలయుమర్మముజూపేనే ॥ఎం॥
పంచదశిభావాముదెల్పి సంచితమెడలించేనే
నిశ్చయముదశాక్షరిదెల్పి స్వేచ్ఛమార్గముజూపెనే ॥ఎం॥
సర్వంఖల్విదబ్రహ్మంబనియా సమరసైక్యముజేసేనే
బర్వికించిన్నేహనానాస్త్యని సర్వంమిథ్యగదెల్పెనే ॥ఎం॥
భాసురముగాసుబ్బరాద్గురుడే శ్రీశ్రీనివాసుడే
దాసుడౌశ్రీకూర్మారాయుడు దోసిలొగ్గియుండేనే ॥ఎంత॥

కళ్యాణి—ఆట

శ్రీయుతంబగుసృష్టిమర్మము చిత్రమెటువలె గురువరా
సత్యమాయాబ్రహ్మమందున నిత్యమామెర శిష్యుడా॥

సత్యమనగా నేమొదెలుపవె సద్గుణాకర గురువరా
నిత్యమౌ యామర్మమెరిగితె నిజముబయలగు శిష్యుడా॥
జీవ ఈశ్వరభేద మేమో తీపిదెల్పుము గురువరా
భావితముమాయాద్వయంబుల సోహమొకటే శిష్యుడా॥
జీవులనగా నెందరో నా స్థితినిదెల్పవె గురువరా
భావమందున పద్ధతెరిగితె జీవుడొక్కడె శిష్యుడా॥
దేము డొక్క డనేకతనువుల గానుపడుటెటు గురువరా
భానుడొక్క డనేక ఘటముల గానుపడువిధి శిష్యుడా॥
సాంఖ్యమనగా నేమొదెల్పి సంతోరించవె గురువరా
సాంఖ్యమందున యాత్మనాత్మల సంధి దెలసును శిష్యుడా॥
అండపిండము లనగనేమో రెండుదెల్పవె గురువరా
యండపిండా భావములను చెండివేయర శిష్యుడా॥
నిండియాబ్రహ్మండమున దానెందునుండును గురువరా
దండియా యామేటిరంధ్రము నందుయుండును శిష్యుడా॥
ఇంతమర్మము దెలియుటకునే నెంతవాడను గురువరా
చింతపడకుము మర్మమంతా యంతుదెల్పెద శిష్యుడా॥
అంతుదెల్పి సంతసముగా చింతబాపుము గురువరా
చింతమానుము రక్తవర్ణము చెంతగనుమో శిష్యుడా॥
సూక్ష్మదేహం సూటిజూపి మోక్షమొసగుము గురువరా
నిర్మలంబా శ్వేతరూపము నిజముదెలియర శిష్యుడా॥
స్వచ్ఛమగు యాకారణాంగం బెచటనున్నది గురువరా
నిశ్చయముగను రెంటికినిపై నీలకళరా శిష్యుడా॥

మహాకారణమనగ నేదో మరుగుదెల్పవె గురువరా
సహజముగ యామధ్యపీత చ్ఛాయదెలియర శిష్యుడా॥
నిక్కముగ కైవల్యపదముకు నిలుకడెక్కడ గురువరా
నిక్కిచూడగ పశ్చిమంబున చొక్కుతక్కది శిష్యుడా॥
అందుపై నింకేమిచోద్యము పొందియున్నది గురువరా
యందు నాత్మానాత్మలైక్యము సంధిదెలియర శిష్యుడా॥
తారకంబని చెప్పుచుందురు సారమేమొ గురువరా
తారకంబన తన్నెరుంగని తత్పదంబే శిష్యుడా॥
ముద్రలైదే తారకంబని మురియుచుందురు గురువరా
నిద్రలో నిర్నిద్రదెలియక నిజముదొరకదు శిష్యుడా॥
ఇల మహావాక్యముల నాల్గిటి విధముదెలుపుము గురువరా
వెలయు జీవబ్రహ్మలైక్యము లలరజేయును శిష్యుడా॥
షోడశాక్షరి యనుచు నుడివే రూఢియేమొ గురువరా
రూఢిలేని శరీరమిదియని గూడకుండుము శిష్యుడా॥
ద్వాదశాక్షరి మూలమేమొ బోధపరచవె గురువరా
ఆదియంత్యములన్ని నొకటిగ బోధయగు ప్రియశిష్యుడా॥
పంచదశి యనిపల్కుచుందురు మించదేమొ గురువరా
అంచితంబుగ స్వప్నజాలం బంచునమ్మర శిష్యుడా॥
యాత్రలను పలుమార్లుదిరిగిన గాత్రమిదునా గురువరా
యాత్రలనుసేవించినందున గాత్రబాధలు శిష్యుడా॥
దారులోహ మాదిపూజల సారమేమది గురువరా
కోరియర్చన జీవభ్రాంతగు సారమిదియే శిష్యుడా॥

కులము లాచారములువలదని పలువు రందురు గురువరా
ఫలములేదది వర్ణధర్మము దొలగరాదుర శిష్యుడా॥
దేహి దేహంబులకు వేరని యూహనెంచెద గురువరా
దేహి దేహం బొకటి మూలము బాగదెలియర శిష్యుడా॥
సన్యసించినమాత్రమున నే జన్యమిదునా గురువరా
సన్యసంబన పూర్వకృత సాకర్మశేషము శిష్యుడా॥
కర్మశేషంబైనయిక సద్ధర్మమెయ్యది గురువరా
పూర్వఫల మదిదెలసి నీవిక బుద్ధినుండుము శిష్యుడా॥
పెద్దలను దూషించువారికి హద్దుయెయ్యది గురువరా
మొద్దుగుణముల చేతరోగనిబద్ధులౌదురు శిష్యుడా॥
గురుబ్రహ్మకు వేరులేదని వరులుచెపుదురు గురువరా
పరము జూపను గురుడుగాకను పరులవశమా శిష్యుడా॥
అచల పరిపూర్ణుల మటంచును యందురేమది గురువరా
సచరము లనంగనొకటను వచనరహితము శిష్యుడా॥
శరణు కోమ రోల్పుబ్బయార్య శరణుశరణో గురువరా
ధరణిలో శ్రీకూర్మరాయ దాస శుభమగు శిష్యుడా॥

నాదనామక్రియ—అట

ఎక్కడా వెదకిన లేదురా జీవునకు మోక్ష మెక్కడా వెద
కినలేదురా॥ యెక్కడా వెదకిన లేదు చక్కగాగురు సేవజేసిన
నిక్కముగా నిచ్చుపరమును టక్కరీమాటాలు నమ్మకు ॥యె॥
యెందుజూచినయందెదైవముగ యదిగనకగురులను నిందజేయ

దలంచుచుందురుగా దుర్మార్గులైతా ముందుపదవిని జెందకుం
దురుగా సంసారకూపమునందుబడి శ్రమజెందుచుందురుగా॥
సందుసందున తిరిగి స్త్రీల పొందుగోరుచు నిందలనుబడి యిందు
శేఖరుదలచిగురునకు వందనము సేయానినరులకు ॥యెక్కడా॥
ధనము ధాన్యముగలదునాకని ఘనముగాజీవించియవ్వన దినము
లందున కాలమెల్లను వనజముఖులతో పొద్దుబుచ్చుచు॥ మన
మునను హరిదలచడాయెనుగా యీతనువుమాయాదనుచు దెలి
యకదిరుగుచుండునుగా ధరలోనపావన జనములను కనుచూడ
కుండునుగా బహుకల్లలాడి ధనము మెండుగ గూర్చుచుండు
నుగా॥ తనదు కర్మల బారదోలే దనుజహరువరమిత్రపూజలు
అనయమునుతాజేసి గురుడని యాశ్రయించి నగానిము క్తి॥
యె॥క్కడా॥ ముసలితన మునకరబూని ముసుకువేసుక మూల
బండి కపటకృత్యము వదలకనుతా చపలుడై చావంగనుండి తప
సులను దూషించుచుండునుగా అదిజూచిదూతలు పటపటాయని
పండ్లుకొరుకునుగా దొరయాజ్ఞలేదని విఫలమనమున బోవుచుం
దురుగా సతిసుతులు యేదో నెపముజేతను దిట్టుచుందురుగా॥ సత
తమును శ్రీకూర్మరాయుడు సన్నుతించినస్వామిపదములు మతిని
ధ్యానముజేయకను బహు వెతలుబడి విసుగునను తిరుగుదు
॥రెక్కడా వెదకిన లేదురా॥ జీవునికి మోక్షం॥

ధన్యాసి—అట

మరువకనుగురునామమెప్పుడు మదిని నిల్పి చరించుడీ నిర
తమును ధ్యానించుమాయను సరగుననునిరసించుటకునిక ॥మరు॥

తనువు శాశ్వితమనుచునిత్యము కనులపండువతోడుత మనసు నందున భ్రమసి తిరిగెడు మానవులు దుర్మార్గమిడచి ॥మరు॥ ముక్తిమార్గము గాంచలేకను మూఢులై జగమెల్లదిరిగి వ్యక్తి లేకను చెడుటకన్నను వేదవేద్యుని దలచుచునిక ॥మరు॥ అచల మెప్పుడు సాధ్యపడక నపాయములచేబాధనొందుచు యశము నొందదలంచి దిరుగుచు యమునిచే శ్రమజెంద కెప్పుడు ॥మరు॥ చుట్టపక్కము లన్నదమ్ములు సుతులు బాంధవు లతివలున్నను నెట్టుకొనిజీవి కొనిపోవగ నెవరువెంటను రారునిజమిది ॥మరు॥ యౌవనంబున క్రొవ్వుచేనిల పూవుబోడులబొందిపోయని నవ్వు లాడుచు జేయుయఘముల నాశనము జేయుటకుమనమున ॥మరు॥ ధరణి కొమరోలున్బ్బయార్యునిదాసుడగు శ్రీకృష్ణరాయుని కరుణనేలిన కాంచనాంబర ధరుని సతతము గాంచుటకునిటు ॥మరువకను॥

నాట—ఆట

బ్రాహ్మణులము మేమనెడువారలను
బ్రస్తుతిజేసెద వినరయ్యా॥
ప్రకటముగా మీవాక్కులస్థిరతకు
ప్రపంచమూలము దెలుపరయా॥ బ్రా॥
బ్రహ్మజ్ఞానమె బ్రాహ్మణత్వమని
వరశృతిబల్కుట వినరయ్యా॥
బ్రహ్మముమూలము దెలియనివారికి
బ్రాహ్మణత్వమెటుచెల్లునయా॥ బ్రా॥

ముఖోద్భవులమని చెప్పెడిమాటల
మూలముదాచక జెప్పరయా॥
ముఖసృష్టని యది మార్చినముఖ్యుల
ముదమున బేర్కొనవిందుమయా॥బ్రా॥
మఖములు మెండుగ జేసియు బ్రాహ్మణ
మర్మంబిదియన చెల్లదయా॥
నికర బ్రాహ్మణులైతే నిర్మల
నిత్యానందము గందురయా॥బ్రా॥
కర్మద్విజులై ధర్మము దెలియక
దుర్మతులై వాదింతురయా॥
వేషభాషలెన్నెన్ని వేసినను
దోషరహితపద మెరుగరయా॥బ్రా॥
నాసిగవర్ణములున్నను జన్మలు
ఒకటిగాని దెటు తెలుపరయా॥
సర్వంఖల్విదబ్రహ్మంబనుసద
సద్వివేకమును యెరుగరయా॥
సర్వాత్మల సమరసము దెలసిన
సద్బ్రాహ్మణులని తెలియరయా॥బ్రా॥
లోకశాస్త్రములు హాసము జేయువి
వేకము మదినూహించరయా॥
వేదాభ్యాసము సనాతనంబని
వెర్రిభ్రమలు మీకెందుకయా॥బ్రా॥

సర్వజనంబుల సమతనుబోధించే
సామిధర్మమని దెలియరయా॥
యుధర్మమని మీమాటలు యే ప్రొ
ద్దారయగానిది తెల్లమయా॥బ్రా॥
సత్యంబని శ్రీచౌటపల్లి సోమేశుని
సాక్షిగ వినరయ్యా॥ బ్రాహ్మణులము॥

జంఝూటి — అట

గురురుచరణాస్మరణా మృతపానము నరులకుజీవన్ముక్తిసాధనము॥ సారరహితసంసారమహోదధి తరియించుటకిదిసాధనము ॥గురు॥ తాపత్రియముల యేపడంచుటకు ప్రోపెగద మీసేవనము ॥గురు॥ కామక్రోధవిషోరగములకును కూ్రరబర్హి గురుసేవనము॥గురు॥ యీషణత్రియముల యేపుమాన్పుటకు భేషజమాగురుసేవనము ॥గురు॥ స్థిరమస్థిరముల పాదుదెల్పి పరమార్థమార్గమీ సేసనము॥గురు॥భక్తిచేతగురూక్తి దెలిపిప్రత్యక్షముజేయును సేవనము ॥గురు॥ మూలములేని ప్రపంచము బయలను పోలుజూపుమీ సేవనము ॥గురు॥ తత్త్వమసీయను సాగాంశముచే ముక్తినిచ్చునీసేవనము ॥గురు॥ ధరణిలోకూర్మరాయదాసునకు ధర్మమార్గమీ సేవనము ॥గురు॥

నాదనామక్రియ — అట

హరిహరిహరిహరి హరియిందురారా॥
హరియిందురార శ్రీహరి నరహరి మురహరి యిందురార నన్గరుణించవేరా ॥హరిహరి॥

సుందరాకారశ్రీ వందితచార
కందర్పజనకానన్గాపాడవేవేగా ॥హరి॥
ఇందుమౌళ్యాదిసురవందితపాద
సందేహమేలనో యిందిరాలోలా ॥హరి॥
సత్యసంకల్పయో సర్వాంతరాత్మా
నిత్యనిరంజన నిరుపమాకార ॥హరి॥
దశదళాంతరనిలయ దశవేషధారీ
యశదృశాకార నన్నాదరించార ॥హరి॥
నిత్యాడననినిన్ను సత్యముగానూ
బ్రిస్తుతిజేసెద పాలించువేగా ॥హరి॥
ధరచౌటపురిపాల హరికేశవాఖ్య
వరకూర్మదాసుని దరిజేరరారా ॥హరిహరిహరిహరి॥

మోహన—ఆట.

రామరామరామ రామయిటురార
శ్రీరామరామరామ రఘువంశదీప ॥రామ॥
జనకాజరమణా సజ్జనమిత్రవేగా
అనవరతమునిన్నే ఆశ్రయింతునురా ॥రామ॥
కౌసల్యాతనయనన్ గాపాడవేరా
కంసావిమర్దన కంజాతనేత్రా ॥రామ॥
నిత్యనిరంజన నిరుపమాకార
సత్యవాక్పరిశీల సాధుజనపాల ॥రామ॥

వాసవార్చితపాద వరసుగుణజాల
దాసపోషకనన్ను దరిజేర్పచాలా ॥రామ॥
రాతినాతిగజేయు ఖ్యాతినీదేర
పాతకహార పశుపతిధనుర్భంజన ॥రామ॥
సాహసాగ్రనిలయ సద్రూపధారీ
కుహాశకహార సర్వకువలయధారీ ॥రామ॥
సర్వజ్ఞమూర్తియో సదయాత్మరార
దర్వీకరశాయి దరిజేర్పవేరా ॥రామ॥
ధరచౌటపురిపాల దయజూడవేలా
వరకూర్మాగాయ హృత్పద్మాలవాలా॥
రామ రామ రామ రామయిటురార॥

ఆనంద భైరవి——ఆట

రామనామామృతరసము పానముజేసి
రంజిల్లుచుండవెమానసామా॥
సామాజవరదుని సద్గుణచర్యలు
సీమాముతోడుత నిత్యముపాడుచూ॥రా॥
కామాదిగుణముల కదలనివ్వకబట్టి
వేమారుశ్రీరామ నామామెగోగ్లిలుచు॥రా॥
ఆరుకమలములకు నాధారరూపమై
పారాములేకను పరమాత్మజ్యోతియా॥రా॥
సాహసాగ్రమునందు సద్గురురూపమై
యహంభావములేక యంతాతానై వెల్గు ॥రా॥

పాపాలమధ్యమున యాపోజ్యోతియునై
వ్యాపించియుండేది యంతరాత్మను దెలసి ॥రా॥
ఉపజిహ్వాపాగ్రిద్దిశను త్రిపుటమధ్యమునందు
జపముజేయుచునుండు జగదంతరాత్ముడో ॥రా॥
భానుమందిరముపై పరిబలుశశిమందిరము
దానిపైయగ్నిలో దనరుసదానంద ॥రామ॥
సోహంశబ్దముచేత సూక్ష్మస్వరూపమై
యహంభావములేక యంతాటవ్యాపించు ॥రామ॥
దాసుడౌశ్రీకమఠరాయూనిహృదయా ని
వాసుడై పరతత్వమొసగుచుండెడియూత్మ ॥రామూనామా॥

కల్యాణి — అటతాళము

చూడుమీమనసాచూడుమీ నీలోనీవేచూడుమీ ॥మనసా॥
చూడుమీమానాసనీవు సుఖముదెలసేదెన్నటికో
చూడగోరి తేనుమంచి ఆడదానిపొందుగల్గును ॥చూడుమీ॥
ముందుమూడుకాల్వలున్నాయి అదిదాటుటకును
పొందికై గురుకరుణయున్నది ఆకరుణలోనాసందుఒకా్కా
టుమరియున్నాది యాసంధిదెలసితె చందురూనిపురము
యున్నాది॥ చందురూనిపట్నమందున పొందుగాయద్దముల
మేడలో చందనాగంధికి అందెలు పొందుగా పదివిధము
మోగ్రిగును ॥చూడుమీ॥
అల్లనల్లనమొయిలుబట్టేరా యామొయిలులోనా
ఫెళ్ళుఫెళ్ళునయురుముసాగేరా యురుమురమగానే

తళుకుతళుకున మెరపుమెరశేరా మెరయాగానే
మల్లిమొగ్గలవానగురిసేరా॥ మల్లిమొగ్గలవానగురియగ
మొల్లముగ యేకమైనపుడె కల్లగాదుమధురవాణితో
గాఢరతులబెనంగవచ్చును ॥చూడుమీ॥
ముక్కునా ముంగేరయున్నాది
ముంగేరనంటిబక్క వజ్రముమెరయుచున్నాది
యాతళుక్కనంటి చొక్కపుముత్యాముయున్నాది
ముత్యామునంటి చక్కెరాకెమ్మోవియున్నాది॥
చక్కెరాకెమ్మోవిగ్రోలి చక్కలాగింతాలమీరి
మిక్కిలీఆనందపాదున ముక్తిమానస్థానమున్నది ॥చూడుమీ॥
సుందరాంగిని సూటిగనుగొనుమీ
యామందయానపొందుగోరే సందుచూడుమీ
యాసందుగడచి అందిదానివద్ద జేరుమీ
జేరీయుయచటి పొందికెరిగి ప్రియమునందుమీ
కుందరదనాకూటమిచే యందరానిపందవిదొరకును
తొందరగను కూర్మరాయున కందిపొందినపరమపావని
॥చూడుమీ మనసాచూడుమీ॥

కల్యాణి—ఆది

చెండితనమేల వినుమొండిమనసా యింతబండతనమేల ॥విను॥
లండీమనసా బండావిను మొండిశిఖండిమనసా ॥చెండి॥
దండియగు పండితుల యండజేరి సేవజేసి
కుండాలినిదాటిసూర్య మండాలముజూడకను ॥చెండి॥

రామారామ రేరామారఘు రామాశ్రీరామాయని
తామానముమాని నా సామి సేవ జేయాకను ॥చెండి॥
ముందారను మూడుయేర్ల సందుగొందిదారిగని
అందుబయులందుయింపొందు చందమామపురి ॥చెండి॥
చందామామపట్నామున కుందానపు మేడలోన
సుందారికి పదివిధము లందెలును మోృయువిను ॥చెండి॥
ముక్కానబులాకితోను చక్కరకెమ్మావితోను
చక్కానిదానితో నొక్కసారి పొందుజేయకను ॥చెండి॥
భాసురముగాను కూర్మా దాసునెడబాయకున్న
శ్రీశూని రమేశు నాది కేశవ్రూని జేరుమిక ॥చెండి॥

రేగుప్తి——అట

చీఛీపొమ్మనపోవేమే సిగ్గుమాలినపామరమా ॥నినుచీ-ఛీ॥
మోసగాళ్లు ముగురున్నారు మొరిగేకుక్క ఒకటున్నాది
దోసకారిముసలిదొాకతె తోడునీడై తిరుగూచున్నది ॥చీ-ఛీ॥
ఆర్గురుశత్రులున్నారు అహంకారముమానానివరు
మూర్ఖమతమువిడువానివరు ముందువెనుకాజూడానివరు ॥చీ-ఛీ॥
పాశధరులైదుగురున్నారు పాకీపనులను మానానివరు
పరముజూచుటకుబాటాయివరు పట్టియిష్టముగబంధించెదరు॥ఛీ॥
ఎన్ని జెప్పిన వినకున్నావు తిన్ననిబాటానడువావు
దున్నపోతువలెనే నీవు కన్నుగానక తిరిగేదావు ॥చీ-ఛీ॥
ముందుజూడ ముగురున్నారు సంధినిజూడాచాలాగలరు
అందరూఒకటీగగూడి పందిపనులుచేయించెదరు ॥చీ-ఛీ॥

చాడికోర్లు చాలాగలరు కూడినాట్యమాడించెదరు
వీడిపోవసందేయివరు విడువకమరికట్టించెదరు ॥చీ-ఛీ॥
ముగ్గురునల్గురుకూడున్నారు మూలమేదోచూడానివరు
తగ్గుహెచ్చులాడుచుందురు తగినట్లూగానవ్వుచుందురు ॥ఛీ॥
ధరలోకొమరోల్సుబ్బరాజ గురునీసన్నిధిజేరకెపుడు
పరముజాడాచూడాతరమా పామరము వదలించతరమా ॥చీ॥
వాసిగాఅట్లూరికూర్మయ చానునివాక్యములే నిజముని
యాశజేరేబాటాగనక వెర్రిపోకలన్నివిడచి ॥చీ-ఛీ॥

సురట—ఆది

రామనామమును రత్నము దొరకెను రండి సుజనులారా
చూడండి కనుకొనండి వెతుకండి సుజనులారా॥
ప్రేమమీర యీరత్నముకనుగొన కామములన్నియు గడదే
ర్చునుభువి ॥రా॥
విలువలేనిదిది వెదకినదొరుకదు వెలకురాదుగొనరే
యిలనవరత్నంబులలోమించిన వెలుగుదీనిగనుగొని సంతసమున
॥రా॥
స్పష్టముసాధులుసంతరించునది దుష్టులకిదివిన నిష్టముగానిది
అష్టమదంబులనష్టముజేయును భ్రష్టగుణంబుల బాపగజాలును
॥రా॥
అంతటతానైయఖండమానిది యింతకుజూడరవంతైయున్నదిం
పంతములాడేపామరమతులకు సంతరించగనసాధ్యంబైనది ॥రా॥

వసుధనుకొమరోల్పుబ్బరాజగురు వద్దనెయున్నది యీరత్నం
దాసుడైన శ్రీకూర్మరాయునకుదయచేనొసగెనుయిదిరత్నము॥
రామనామమను రత్నముదొరకెను॥

నాదనామక్రియ—ఏకతాళం

రామరామ శ్రీ రామారామా రామాయను మిక పామర
మేలను ॥రా॥

కామాదులచే కష్టమునొందకు రామమంత్రమిల రాజై
యున్నది ॥రామ॥

దేహసుఖంబుల మోహాముపదలియు నాహామాహామని నయ
ముగబల్కువు

మహావాక్యముల మర్మంబిదిసుమి మహానుభవమా మంత్రరాజ
మని ॥రామ॥

అజపమంత్రమునకాధారైయున్నది సుజనులకెల్లనుసూత్రార్థంబిది
హంసమార్గులకు యందంబౌనిది సంశయరహితము సర్వార్థం
బగు ॥రామ॥

సోహంభావమునూటిచూపునిది యీహంభావము లణచివే
యునది

ముగురుమూర్తులకు మూలంబౌనిది సద్గురుకరుణకుస్థానం
బౌనిది॥రామ॥

మూటగెలచి యిరుమూటిగెలచి యేమూటికినందని బాట
జూపునిదె

ధరణిలొ అట్లూరికూర్మరాయగురు దాసునిహృదయము దవిలి
యున్నదది ॥రామ॥

జ్ఞానయోగ ప్రకరణము

గురుశిష్యసంవాదము

నాదనామక్రియ—ఏకతాళం

శ్రీగురువర్యా చిత్తగించి నా చింతదీర్చు గురురాయ
యీపంతమేల ప్రభురాయా॥

శిష్యతిలక నీచిత్తకలంకము శీఘ్రమె దెల్పగదోయి
అతిశీఘ్రమె దెల్పగదోయి॥

బ్రహ్మవిదాదుల తారతమ్యములు సమ్మతితో దయసేయూ
మానమిమ్మికగా కృపజేయూ॥

బ్రహ్మవిదుడు విద్వర విద్వర్య వరిష్టుల పద్ధతివినూమూ
బ్రహ్మనిష్టులపద్ధతి వినూమూ॥

మొదలు బ్రహ్మవిదులక్షణములు నా హృదయము నాటగదెల్పూ
నా హృదయము నాటగదెల్పూ॥

బ్రహ్మవిదుండా జ్ఞానభూమికల నాల్గిటిచేరికయుండూ
మదినాల్గిటినాటియుండూ॥

బ్రహ్మవిద్వరుండనగానెవ రా ఫణితిదెల్పు గురురాయా
వారిపద్ధతేమి ప్రభురాయా॥

పంచమభూమిని సంచరింపుచును అంచితముగ తానుండు
యిహ వంచనలెరుగకయుండూ॥

బ్రహ్మవిద్వర్యుడనగా వానికి బాటయేమి ప్రభురాయా
హరిపద్ధతేమి గురురాయా॥

దేహేంద్రియముల జ్ఞప్తిలేక తా దేహమందునటియించు
తా దేహముతో చరియించు॥
బ్రహ్మవిద్వరిష్టుండనవారి భ్రామి కేది గురురాయా
సద్భ్రామి కేది ప్రభురాయా॥
బ్రహ్మనిష్టయెడతెగకసమాధిని బ్రహ్మమెసర్వముబొందు
తాసర్వమె బ్రహ్మమునందు॥
అష్టగురువులని నిష్టలుపలికే వ్యష్టియేమి గురురాయా
సామష్టిలేద ప్రభురాయా॥
బోధాదిగ కారణాంతమా గురు భేదము లష్టకమాను
గురుభేదము లష్టకమాను॥
బోధకాదియష్టగురుల వివరము గాథయేమి గురురాయా
ప్రబోధజేయు ప్రభురాయా॥
బోధకగురుడల శాస్త్రచయంబుల బోధజేయు వినవోయి
సద్బోధ నీవు గనవోయి॥
వేధకగురువన సాధనలేమో బోధజేయు గురురాయా
సద్బోధజేయు ప్రభురాయా॥
మంత్రమూలముద్రాంతముగాగల సంతజేయు వినవోయి
పరచింతదెల్పు వినవోయి॥
విహితగురువ నా విధ మదెట్టిదో మహిమలేమి గురురాయా
యా మహిమదెల్పు ప్రభురాయా॥
శిష్యులయిష్టము తృప్తిగదెల్పు సమష్టిలేదు వినవోయి
సంతుష్టిలేదు వినవోయి॥

## జ్ఞానయోగ ప్రకరణము

కామ్యకగురులన నీమములేవో సామ్యమేమి ప్రభురాయా
వారిసాధనేదో గురురాయా॥
ఇహపరకామ్యములెల్లను దెల్పుచు సఫలముజేయుగదోయి
అతిచపలము లణచుగదోయి॥
సూచకగురువరు వాచకమేమో లేచిచెప్పుగురురాయా
అదిదాచబోకు ప్రభురాయా॥
సాంఖ్యతారకము మోదముజూపుచు సాధుజేయు వినవోయి
స్వరసాధుజేయువినవోయి॥
వాచకగురువరు సూచనయేమో దాచనేల గురురాయా
యదిదాచనేల ప్రభురాయా॥
సూచనలన్నియు శోధనచూపుచు యోచనలను మాన్పించు
పరయోచనలను మాన్పించు॥
నిషేధగురుడనగా నతిడెవడో నిర్ణయించు గురురాయా
యదినిర్ణయించు ప్రభురాయా॥
అశేషజగమహామంచనిదెల్పెడి యాతడు నిషిద్ధుడౌను
గను మాతడు నిషిద్ధుడౌను॥
గాకనుమింగిలిన కారణగురువరు గమనమేమి గురురాయా
వారి క్రమముదెల్పు ప్రభురాయా॥
ముగురుమూర్తులకు మూలముదెల్పుచు పూర్ణజేయువినవోయి
పరి పూర్ణజేయు వినవోయి॥
పరిపూర్ణంబని పల్కుదురందరు పద్ధతేమి గురురాయా
యా పద్ధతేమి ప్రభురాయా॥

పరిపూర్ణంబన ప్రాజ్ఞుల కందక పరమైస్థిరముగనుండు
యది ప్రకృతికి వేరై యుండు॥
ఈ సచరాచరలోకంబంతయు నేమిదెల్పు గురురాయా
యామూలమేమి ప్రభురాయా॥
ఈ సచరాచరరూపమంత నా భాసమె నిజమని చూడు
పరమాత్మ నిక్కమని గూడు॥
వేదములన్నియు కర్మమూలమని వేత్తలు బల్కుదురేమీ
పరవేత్తలందు రదియేమీ॥
వేదములన్నీ వేశ్యలవంటివి వేదాతీతమె నిజమూ
వేదాంతంబనునదె నిజమూ॥
పరిపూర్ణంబన బ్రహ్మంబను నాభావమేమి గురురాయా
యాపద్ధతేమి ప్రభురాయా॥
బ్రహ్మమె సర్వము భ్రమయే జగమని భావమందు గనవోయి
నీ భావమందు గనుమోయి॥
సర్వప్రపంచ మగోచరమనుటకు సమ్మతేమి గురురాయా
మరినమ్మకేమి ప్రభురాయా॥
సర్వప్రపంచము నెమ్మదిజూడగ బ్రహ్మమె గోచరమాను
పరబ్రహ్మమె గోచరమాను॥
ఇందుకు లక్ష్యము పొందుగజూపి సంధిమాన్పు గురురాయా
యా సందుజూపు ప్రభురాయా॥
కమ్మలుకడియాల్గజ్జంపులు పోగులు ముందుయేద్యో యోచించూ
యాసందేలక్ష్యము నుంచూ॥

మొదలన నేదో అగ్రముయేదో బుద్ధియేమి గురురాయా
సద్బుద్ధు జేయు ప్రభురాయా॥
మొదట కనకమే పెక్కురూపముల ముద మొందించు గదోయి
యది మొదలై నిల్చుగదోయి॥
పట్టుగ కొమరోల్బుబ్బరాజ నీ పాదమె గతి గురురాయా
అతిమోదమొసగు ప్రభురాయా॥
అట్లూరి కూర్మరాయదాస నీ కభయంబొసగెద నెపుడు
భవబంధము లుండవి కెప్పుడు॥

ధన్యాసి—ఆది

ఆనందము పరమానందము శ్రీగురుభజనము॥
ఆనందము నిత్యానందము పరమానందము ॥ఆనం॥
అంతానీవనిఆనందించిన యింతులుపురుషులు వేరులేక ॥నిత్యా॥
తంతేపటముసుమీచూడగ నంతేనీవుసుమీ
సత్తుచిత్తులకు సమరసమైనది హత్తుగానుపరమాత్మయనుచు
॥నిత్యా॥
సత్తేచిత్తుసుమీ గనుగొన యంతయుభ్రమగనుమీ
సత్పదార్థమై వెలితియులేకను యేకరూపమై యెల్లకాలమును
॥ఆనం॥
సర్వంఖల్విదము కించిన్నేహ నాస్తియను
ద్వంద్వరహితపరమాత్మనుగనుమీ ద్వంద్వాతీతమె
ద్వాదశియను ॥పరమా॥

దృశ్యప్రపంచమూ నశ్యము ధృవమదిసత్యమనీ
దృశ్యము నశ్యము దృఢమతిగాంచిన పశ్యంతికిపై
భాసిలుచున్నది ॥ఆనం॥
తరచితరచి మది నీ నిర్మలతత్త్వము తానె యని
ధరణిని అల్లురికూర్మయదాసుడు చిరమని శ్రీగురు
పదమెన్నరించును ॥ఆనందము పరమానందము॥

ధన్యాసి—ఆదితాళం

రామరామయనదీరదుగాని సౌఖ్యులదూరనుదీరునుగా ॥హరి॥
ముద్రలుజేయనుదీరదుగాని క్షుద్రములాడనుదీరునుగా ॥హరి॥
సాధుబోధ వినదీరదుగాని వాదులాడుటకు దీరునుగా ॥హరి॥
హరిహరియననోరాడదుగాని పరులదూషణకుదీరునుగా ॥హరి॥
గోవిందాయనదీరదుగాని గురునిందలకూదీరునుగా ॥హరి॥
మాధవయనుటకుదీరదుగాని మదిరపానముకుదీరునుగా ॥హరి॥
పరునిజూచుటకుదీరదుగాని పరవనితలగనదీరునుగా ॥హరి॥
సుబ్బయార్యగనదీరదుగాని క్లబ్బులాటలకుదీరునుగా ॥హరి॥
కూర్మయవాగ్వినదీరదుగాని కుటిలకర్మలకుదీరునుగా ॥హరి॥
రామరామయనదీరదుగాని సౌఖ్యులదూరను దీరునుగా॥

కన్నడ—ఆది.

కులమేదని నను పలుమరడిగెదరు యేమని నుడువుదునయ్యా
నే నేమని పల్కుదునయ్యా॥
ఆదియంత్యమునులేనీ బయలుం దమరగ వెలసిన దీ కులము
అండపిండబ్రహ్మాండములంద చరాచరరూపము ఈ కులము॥

జ్ఞానయోగ ప్రకరణము

ాడుగుణంబులు మొదలు జేసుకొని మురియుచున్నది
ా కులము॥

హదాదుల దామహిమను మరిమరి మహిలోనలరును ఈకులము
ంచభూతముల పాదుజేసుకొని ప్రబలంబైనది యీకులము॥
ండ్రిగర్భమున దడదడజేయుచు తగునట్లున్నది యీకులము॥
ని జఠరమున చెదరక తొమ్మిది పదినెల లమరిన దీకులము
ంలమూత్రంబులు శుక్లశోణితము మయిలను పెరిగిం దీకులము॥
న్నిముట్లు తన నంటియుండగ హెచ్చనిమురయును యీ
ంలము॥

ంలము మొదలు తా దెలసిన పిమ్మట కలకజెందవలె కుల
ంతా॥

మొదలులేక గుత్తెరుగు కులములకు మురయుచునుందురు కుల
ంతా॥

స్వప్నజాలముకు సరియైయున్నది సర్వభ్రమలను కులమంతా॥
కులభేదంబులు దెలియనివారీ స్థలభేదంబులు జేసెదరు॥
సుబ్బయార్య సత్కరుణను వడసిన తబ్బిబ్బా నీ కులమంతా॥
తప్పులున్నను దయచే నార్యులు ధర్మముగా పాటింతురయా॥
అట్లూరి కూర్మారాయాఖ్యుండిది యనుభవమున వచియించె
నయా॥
కులమేదని నను పలుమరడిగెదరు ఏమని నుడువుదునయ్యా॥

వసంతరాగం—అటతాళము

మంచిదీమంచీదిమంచిదీ యీ దేహము బహు మంచిదీ
మంచీది మంచిదీ॥
మంచిదిరా యీ దేహము వంచనా సేయుట తగదు
కొంచెమైనా యపకారము యెంచిచూచిన చేయదెపుడూ
॥మంచిదీ॥
సంచితాప్రారబ్ధములను యెంచకా తాగాదు వాయుండి
కొంచకాఆచార్యులాజ్ఞ మించకుండా తా నెజరుపును ॥మంచిదీ॥
ఇంద్రియములా నిందించాకు యంది సర్వకార్యములకు
తొందరగనీవెటులదలచిన అందుకే తానిలచియున్నది॥మంచిదీ॥
తారకాసాంఖ్యామనస్క దారిజూపుసాధనలకు
సారెసారెకు దీని నీవు వేరుజేయుట తగదు తగదు ॥మం॥
నీదురక్షణార్థము ముందు భేదపరచి తొంబదారిటి
కాదనక తనలోనేయుంచి పాదుతానై పదిలపరచును ॥మం॥
నిన్నుచాలానమ్మున్నాది నీవువిడచినవిడువదెపుడు
మిన్నకాయగ్నిలోజొచ్చి క్రిన్ననీతోడజేరును ॥మం॥
దీనినీవీడాచినీవే దానినిగానంగలేవు
మానకను సహకారియయ్యే మార్గమునసడువంగగోరిన ॥మం॥
నీకు దానికభేదమూనీ రాకను నీకన్నముందే
ప్రాకటము పరిపూర్ణబ్రహ్మము పీకతోనిను జేర్చుటకునిది॥మం॥
పరుడు సుబ్బరాజసద్గురు వరునికరుణకు ముందునడుచును
ధరను అల్లూరికూర్మరాయుని ధర్మమనిసమరసము జేసెను॥మం॥

## జ్ఞానయోగ ప్రకరణము

### సావేరి—అట

గురుపదములు సేవించవలెర గురువాక్యము మది నుంచవలెర-
సరిగా గురుడే పరముకుపరమని స్థిరముగ వరధీ నుంచవలెర॥
భవములణంచెడి పరమాత్మయెయని భావమందు ధ్యానించ
వలెర ॥గురు॥

జన్మకర్మముల తొలగ జేయగల మర్మము తానని గాంచవలెర॥
ఎన్నిజన్మములకైనను గురుడే సన్నుతిగా బోధించవలెర॥గు॥
తాపత్రియముల యేపడంచుటకు దాపరమనినూహించవలెర॥
గురునకు వేరే స్థిరమస్థిరములు తరచిచూచి గురిగాంచవలెర॥
ఇన్నిటికిని మాసుబ్బరాయగురు నెన్నికగా పూజించవలెర॥
ధరణిని కూర్మారాయసమాఖ్యుడు గురుడెపరాత్పరుడనిమది
నెంచుర ॥గురుపదములు॥

### నాదనామక్రియ—అట.

ఏజాతివారమని ఏవిధిగదెల్పెదను
యేజాతిజూచినను మాజాతిగాదా॥
నాజాతిమూలమే నేనెరుంగనివాడ
నేజాతమో దెలియకెట్లువంచింతుర॥
అన్నివర్ణములకును నాధారమౌజాతి
మన్ననెరుగక యెపుడుమహినిచరియింతుర॥
ఏకవర్ణముచేన నేకమైనాజాతి
జోకవర్ణద్వయం సొంపలరుజాతి॥

మూడువర్ణములచే ముఖ్యమైనాజాతి
నాల్గువర్ణములచే నాణ్యమౌజాతి॥

ఐదువర్ణములకును నాధారమీజాతి
యారువర్ణములందు నమరుమాజాతి॥

సప్తవర్ణములచే చక్కనౌనాజాతి
అష్టవర్ణములకు నిష్టమీజాతి॥

నవమాక్షరములచే నాణ్యమైనాజాతి
దశమవర్ణములచే దరిచేరుజాతి॥

ఏకదశవర్ణముల నెనసైనదీజాతి
ద్వాదశాక్షరములే మూలమౌజాతి॥

పదమూడువర్ణముల్ పలికించుమాజాతి
పదునాల్గువర్ణముల ప్రబలు నీజాతి॥

పదునైదువర్ణముల ప్రజ్వరిలు మాజాతి
పదియారువర్ణముల ప్రకటమగుజాతి॥

ఏకసప్తమిగూడి వెలయుచుండీజాతి
యష్టదశములకే నిష్టమౌజాతి॥

పదితొమ్మిదింటిచే పాటిల్లు మాజాతి
యిరువదింటినిబట్టి వెలయు నీజాతి॥

పంచవింశకునిచే ప్రబలమైనాజాతి
మించి షడ్వింశకుని మేరదీజాతి॥

సప్తవింశతితత్వ సమరసం బాజాతి
యష్టవింశతితత్వ మేర్పడూ జాతి॥
ఇన్నితత్వములచే నెనరైనదీజాతి
నున్నతముగురుపదము నొందు మాజాతి॥
షట్కమలములమీద సంచారమీజాతి
మేరుశిఖరాగ్రమున మెరయు నీజాతి॥
సుబ్బరాద్గురునిచే చూడబడు నీజాతి
వరకూర్మరాయుడై మరువడీజాతి॥
॥ఏజాతివారమని॥

ఆనందభైరవి—ఆది.

పూజా చేతాము రారే సద్గురుని మానసపూజా చేతాము రారే
పూజా చేతాము రారే పూర్ణుడై నిండున్న గురుని
యోజామనీషామందు నొప్పుగా నావాహనజేసి॥ పూజ॥
సర్వమున కాధారమనుచు సత్స్వరూపున కాసనమిచ్చి
నిర్వికారుడైనవానికి నిచ్ఛయే పాదార్ఘ్యమిచ్చి॥ పూజ॥
శ్రద్ధతో నిర్మాల్యునాకు భద్రముగ యాచమన మొసగి
బుద్ధుడై నెలకొన్న ప్రభునకు శుద్ధధర్మస్నాన మొసగి॥పూజ॥
బ్రహ్మాండగర్భునాకు సమ్మతీయను వస్త్ర మొసగి
నమ్మి సర్వాలంబునకు నాలంబరహితుపవీత మొసగి॥ పూజ॥
రమ్యమౌ శ్రీగురువరు నాకు కామ్యమను యాభరణ మొసగి
సౌమ్యమౌ నిర్వాసనునకు సారతరగంధామునొసగి॥ పూజ॥

శబ్దశూన్యరూపునాకు బద్ధరాగాక్షతలు నిచ్చి
లబ్ధవాసనాతీతునకు లలితపుష్పార్చన లొసంగి॥ పూజ॥
బుద్ధికీయతీతునకు శ్రద్ధయానే ధూపమొసగి
శుద్ధబోధరూపునకు సాధనానే దీపమొసగి॥ పూజ॥
నిత్యతృప్తుడైనవానికి ప్రిత్యహానై వేద్యమొసగి
సత్యసత్యాతీతునకు సమ్మతితాంబూలమొసగి॥ పూజ॥
ఎందుజూచినాను లేక పొందుగాతానందువాని
పొందుతాను దెలసి యింపొందగ ప్రదక్షిణమొసగి॥ పూజ॥
అద్వితీయుడైనవాని శ్రద్ధగా నుతిజేయుచును
వేదవాచ్యాతీతునాకు వాదరహితస్తవము జేయుచు॥ పూజ॥
స్వయముగా వెలుగొందు వాని కయమనే నీరాజనమిచ్చి
భయముబాసి యంతర్బాహ్యామయముగా వెలుగొందువానికి॥
శిశుడౌ శ్రీసుబ్బరాడ్గురు వాసమే మానసము జేసి
దాసుడౌ శ్రీకూర్మరాయుని ధర్మమే నిజమని నమ్మి॥ పూజ॥

## మంగళహారతి

మంగళం భూలోకసంచారవాసియై సంగరాహిత్యమున నుప్పొం
గుచు మంగళప్రదమైన మహనీయతత్వము నొసంగిబ్రోచిన
యట్టి సదయునకునూ జయమంగళం॥

పామరులుమెచ్చగ జనార్దనపురమందు సామజవరదుడౌ రాము
నిల్పి సోమసూర్యావీధి శృంగారమొసగి నిజ ప్రేమజూపిన
మహాప్రభువునకునూ ॥జయమంగళం॥

పరగంగలక్ష్మణా భావాజినామునకు సరవి దాసులతత్వసాధకు
నకూ స్థిరతజోగికిద్వైత సురుచిరత్యాగికిని వరఖేచరాంత
రాంతర్వనతికి ॥జయమంగళం॥
వరుసపింగళనామవత్సరమాఖమున సురుచి యేకాదశినిసుస్థిర
ముగా గురునివాసరమందు గురినిల్పియారాత్రి పరమపద
వాసుడై ప్రభువునకునూ ॥జయమంగళం॥
ప్రత్యహము నూతుల పాటిసుక్షేత్రమున సత్యమాగతిచనియె
సామాధికి నిత్యమును దాసులకు నిజవాంఛితములొసగు
ప్రత్యక్షదైవమా పరమఋషికి ॥జయమంగళం॥
పొంగుచును సాకార లింగస్వరూపుడై చెంగటను నిత్యపూజల
బొందుచు రంగుమీరగ అన్నె రత్నమాంబికచేత గంగా
ర్చనలుబొందు ఘనునకిపుడూ ॥జయమంగళం॥

అందముగ కూర్మయ్య యలరుచును భక్తులతో పొందుగా
గూడుకొని పూజొనర్చి కుందరదనలు గుంపుగూడి హారతు
లివ్వ పొంది యుప్పొంగు గురుపుంగవునకూ ॥జయమంగళం
నిత్యశుభమంగళం జయాజయమంగళం మహోత్సవ
మంగళం॥

## మంగళహారతి.

### ఆహిరిరాగం—త్రిపుటతాళం

మంగళహారతులివ్వరే యంగనాలారా మంగళహారతులివ్వరే॥
సచ్ఛిష్యులంతా సత్పురుషులంతా సద్గురునాకు ॥మంగ॥

సంగరహితునాకు నిస్సంగవర్జితునకు
మంగళావిగ్రహానాకు సర్వాంగసమనిలయానాకు ॥మంగ॥
త్రిపుటిరహితునకు కపటవిదూరునకు
త్రిపుటీకవ్వాలవెళ్గే నిష్కపటామానాసునకు ॥మం॥
పంచకోశాతీతునాకు ప్రపంచదోషరహితూనాకు
సంచితము లెడజిమ్ముటకును పంచబాణుని తండ్రియితడని॥మం॥
శిష్యజనసంప్రీతుడై తా నిష్టముగ సాకారియై
యష్టమదముల నష్టపరచగ నిష్టమారూపమరుగురునకు ॥మం॥
జాతినీతిలేకను సకలాంతర్యామిరూపముతోడను
నూతిచెంతనునిలచివెళ్గే నాతితోపెనగాడు వానికి ॥మం॥
కుండలాగ్రమందునయా ఖండజ్యోతిరూపునా
నిండివెల్గుచుదండియాయా ఖండఖండప్రభాధ్యూనాకు ॥మం॥
నిరుపమాకారునాకు నిత్య నిర్మలూనాకు
సచ్చిదానందూనాకు సర్వాంతర్యామికెపుడూ ॥మం॥
కర్పురాహారాతినీారు గ్రక్కునానుచేతబట్టి
తప్పకాపాటాలుపాడుచు నొప్పుగానద్భుక్తులెపుడూ ॥మం॥
షట్పురాధీశునాకు సప్తచక్రాగ్రేసరునాకు
సుప్తిజాగరరహితునాకా సక్తితో సత్పురుషులంతా ॥మంగ॥
స్థిరముగా శ్రీకొమరవోలు సుబ్బరాడ్గురు సన్నిధిని
పరిపరివిధమూలుగాను ప్రస్తుతీజేయూచుసతతము ॥మం॥
భాసురముగా కూర్మరాయదాసునీతోగలసిమీారు
దాసరక్షకుడైనగురుని దాస్యమిమ్మని వేడుకొనుచూ ॥మంగ॥

## లాలిపాట

ఆర్యాలాలీ శ్రీగురువర్యాలాలీ॥
కార్యకారణములకుసాక్షి వయ్యా లాలీ॥

పరమపదమార్గమునుచూపితి వయ్యా లాలీ
మరుగుదెల్పిన మంచిసామి వయ్యా లాలీ ॥ఆ॥

పట్టెమంచం పరపుపరచితి నయ్యా లాలీ
ఘట్టిగాపవళించి నిదురబొందు లాలీ ॥ఆర్య॥

పదములుపదిలముగ నొత్తేమయ్యా లాలి
పదియూరేటిగుర్తు జూపితివయ్యా లాలీ ॥ఆర్యా॥

ద్వాదశాక్షరిబోధ జేస్తివయ్యా లాలీ
ఖేదమోగములు బాపితివయ్యా లాలీ ॥ఆర్యా॥

పంచదశి భావాము దెల్పితివయ్యా లాలీ
మించిన సమరసమూర్తి వయ్యా లాలీ ॥ఆర్యా॥

పంచరంగులమేడనుందు వయ్యా లాలీ
సంచీతమెడలించే సామివయ్యా లాలీ ॥ఆర్యా॥

అంచరూపమున నలరుమయ్యా లాలీ
మించీనసర్వాంతర్యామి వయ్యాలాలీ ॥ఆర్యా॥

నిబ్బరముగా భూత సముడవయ్యా లాలీ
సుబ్బయార్య నూటి నిద్రజెందులాలీ ॥ఆర్యాలాలీ॥

## మేలుకొలుపు.

### భూపాళం—ఏకతాళం.

లేర వోరి జీవ కారణకార్యముల భారమెరుగవలె లేరా॥
భారమెరిగి సర్వసారాము దెలసిన వేరెందునా లేదులేరా॥
జీవా తెలివిగల్గియుండరా॥
సాధనములు నాల్గు సాధించి యావల బోధజెందుదుగాని లేరా
పాదుదెలసి పరమాత్మస్వరూపమై ప్రబలియుండువుగాని లేరా॥
జీవా॥
పంచభూతాది ప్రపంచముకల్లని సంచితమెడలించ లేరా
వంచనలేకను ఒకడే బ్రహ్మమని వరుసాదెలియవలె లేరా॥ జీ॥
షట్చక్రములపైన సంచరించెడిహంస సంధిగానవలె లేరా
షట్భతుృగణమును సాధించియావలసర్వమెరుగవలెలేరా॥జీవా॥
సారమైన సహస్రారకమలమందు సద్గురుని జేరెదవు లేరా
సారేకు సారేకు సద్గూరు కరుణాచే సర్వము నీవౌదు లేరా॥
జీవా॥
అంతా బ్రహ్మంబనే యాంతర్యమెరిగిన చింతాలణగిపోవు
లేరా
సంతాసమున వేరుభావాములేకాను సర్వామునీవౌదులేరా॥
జీవా॥
అబ్బారముగను మాసుబ్బయార్యమదిని నిబ్బారముగ నుంచు
లేరా

శబ్దాములన్నిటి కలయజూచిరినీకు గొబ్బున చెప్పేరులేరా॥
జీవా॥
దాసుడౌ శ్రీకూర్మరాయుని వాక్యముల్ భాసురముగనమ్మ లేరా
వాసవార్చితమైన వరరామనామమె వాసిగనెరనమ్మ లేరా॥
జీవా తెలివిగల్గియుండరా॥

## మేలుకొలుపు

భూపాళం—ఆది

తెల్లవారవచ్చె తెలిపిగభక్తవరు లెల్లగుమిగూడిరిలేరా॥
కల్లగాదుస్వామికన్నులనడుమాను కమలాముకోశసించే లేరా
॥ తెల్ల॥
ముక్కుమీదనుయున్న చుక్క గనుపించెను చక్కనీనాస్వామి లేరా
మిక్కిలిమనసుచే మొక్కినవరమిచ్చి ముక్కువదీర్చుము లేరా
॥ తెల్ల॥
ముద్రలలోపల మూలాముదెలిపేటి చిద్రూపుడౌనీవు లేరా
నిద్రలలోయోగ నిద్రనుమెరుకాచే భద్రపారతుగానిలేరా
॥ తెల్ల॥
వదలకనాధారమునునాల్గుదళముల వ శ ష స వర్ణములేరా
అందూన ఆర్యాన్నిర్లుహంసాలనాడించే అధిపాతిగణేశలేరా॥ తెల్ల॥
స్వాధిష్ఠచక్రమున షడ్దళములమీద బ భ మ య ర ల లు లేరా

అందాన యీార్వేలహంసాలనాడించే అధికారివౌధాతలేరా
॥ తెల్ల॥

మణిపూరకమునందు మరిపదిదళముల ద ఫ లాది ఫాంతము
లేరా

అందాన యీార్వేల హంసాల నాడించే ఆర్ద్రాక్షశ్రీహారిలేరా
॥ తెల్ల॥

పరమ యనాహత ద్వాదశదళముల వర కాది ఠాం త్తముల్లేరా
అరలేకయీార్వేల హంసాలనాడించే పార్వాతిపతినీవులేరా॥ తెల్ల॥
శుద్ధమహావిశుద్ధ షోడశదళముల షోడశస్వరములులేరా
పదినూర్లహంసాల పట్టూగనాడించే పతియైనజీవాత్మలేరా
॥ తెల్ల॥

విదితముగ ఆజ్ఞేయ ద్విదళచక్రమునందు యధికారిపరమాత్మ
లేరా

వదలాక హం క్షం వర్ణములకుమీాద పదినూరుహంసాలులేరా
॥ తెల్ల॥

అరలేక సహస్రార మనుపద్మమందున అష్టాదళములుండులేరా
హంసాలుదశశతంబాడుచునుండునుఅధికారిసద్గురూలేరా॥ తెల్ల॥
వరుసాగాపట్లూరి వరకూర్మరాయుడు శరణానిమ్రొక్కెనులేరా
శరణుజొచ్చువారి కరుణాజూడగవాలే సరగూనగురురాయా
లేరా ॥ తెల్లవారవచ్చేను॥

## మంగళహారతి

### కల్యాణి—ఆదితాళము.

మంగళమిదె రామచంద్ర మానిమానసాబ్జసాంద్ర ॥మం॥
సంగరహిత వరగుణేంద్ర సత్యపరాక్రమచంద్ర ॥మం॥
సారసగర్భాదివందిత సరయుతీరమానిపూజిత
సరససీతాలక్ష్మణులతో సంచరించినట్టిరామా ॥మంగ
ధర్మముపోషించుటకు నధర్మము ఖండించుటకును
మర్మముగను దనుజవరుల మర్దించితివౌర రామా ॥మం॥
ఆధారమాదిగాను యారుకమలమూలమీద
పాదుకొనియద్భుతముగ పరమహంసవైన రామా ॥మంగ॥
సహస్రారకమలమందు సద్గురూజ్యోతివయ్యు
అహంకారమేమిలేక అంతట వ్యాపించురామా ॥మం॥
కంటిపాపలోపున నిష్కంటకచిద్రూపుడవై
యుంటి వధికతేజమునను కంటిని పరమాత్మరామ ॥మం॥
మోదమలరపరాపశ్యం త్యాదిప్రణవనాదమునను
పాదుకొల్పి పరమపదము సాధుజనులకిచ్చినరామా ॥మం॥
వాసిగ శ్రీ చౌటపురినివాసరక్షణార్థముగా
భాసురముగకూర్మరాయ దాసహృన్నివేశ రామా ॥మంగ॥

